Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 45 • 5-11-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# నన్నెవరూ పట్టించుకోరేమి?

## ● ఈ ప్రశ్నకు బదులు దొరకక చంద్రబాబు మనోవేదన

ప్రత్యర్థి బలహీనతలను తన బలంగా మార్చుకోగలగడం రాజనీతిలో ఒక భాగం. కానీ అపర చాణక్యుడిగా పేరు పొందిన తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు ఎందువల్లనో ఈ విషయంలో దారుణంగా విఫలమౌతున్నాడు. గత ఏడాది కాలంగా రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాలు గమనిస్తే ఎవరికైనా ఇట్టే అర్థమయ్యే నిజమిది.

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి ఇది చేటుకాలం. ఏ కోణంలో చూసినా మంచి అన్నది మచ్చుకైనా కన్పించడం లేదు. తానే చెప్పుకొన్నట్లు గ్రహపాటునో పొరపాటునో ముఖ్యమంత్రి అయిన రోశయ్య దిష్టి బొమ్మ వలె మెలగుతున్నాడు. ఆవాహన, విసర్జన లేవు. సీనియర్లుగా తమను తాము వర్ణించుకొనే కాకాలు, కేకేలు, పీకలు, తోకలు చెలరేగి పోతున్నారు. తెలంగాణ నెపంతో పార్టీకి నడివీధిలో గుడ్డలిప్పి, గంతులేస్తున్నారు వారు. వైఎస్ జగన్ వేరొక ప్రక్క కాంగ్రెస్‌ను శాశ్వతంగా భూస్థాపితం చేయాలనే పంతంతో వూళ్లు పట్టుకొని తిరుగుతున్నాడు. ఆయన భజన బృందం మొత్తం ప్రతిరోజు టీవీ ఛానళ్ల స్టూడియోలో చేరి, కాంగ్రెస్ నాశనమై పోవాలని శాపనార్థాలు పెడుతున్నది. మరొకప్రక్క కెవిపి.రామచంద్రరావు రోశయ్య పక్కనే కూర్చొని గతకాలంలో తాము చేసిన నేరాలు, ఘోరాల నుంచి తమను తాము కాపాడుకొనే ప్రయత్నం చేస్తున్నాడు. ఆ క్రమంలో పార్టీ పరువు, ప్రభుత్వ ప్రతిష్టలకు ప్రతిరోజు నువ్వులు వదలి పెడుతున్నాడు. పిసిసి నిర్వీర్యమై పోయివుంది. ఏడాది కాలంలో కార్యకర్తలకు స్ఫూర్తి నిచ్చే కార్యక్రమం ఒక్కటీ చేపట్టలేదు. రోశయ్య గారి అణాకానీ లెక్కల చిక్కు ముడులలో చిక్కుకొన్న ప్రభుత్వ సంక్షేమ పథకాలు మంచం పట్టాయి. ప్రజలలో ప్రభుత్వం పట్ల విసుగు, కోపం పెరిగి పోతున్నాయి. ఇదే అదనుగా భావించిన అధికారులు, మంత్రులు, ఇతర రాజకీయవాదులు ఖజానాను తమ చిత్తం వచ్చిన రీతిలో దోచుకొంటున్నారు. సెక్రటేరియట్‌ను బజారుగా మార్చి, జిఓలను వేలం పెడుతున్నారు.

రాజకీయంగా, పాలనాపరంగా ఇంత భ్రష్ట స్థితి రాష్ట్రంలో ఇంతకు ముందెప్పుడూ లేదు. ప్రతిపక్షాలకు ఒకరకంగా పండుగ సమయమిది. ప్రజలలో ప్రభుత్వంపై పెరుగుతున్న క్రోధావేశాలను తమకనుకూలంగా మలచుకొని మళ్లీ గద్దె నెక్కే మహాప్రస్థానానికి ఉరుకులు పరుగుల మీద లగెత్తవలసిన సమయమిది. కానీ ఎందువల్లనో, ఏ కారణం చేతనో చంద్రబాబు ఆ పరుగు అందుకోలేక పోతున్నాడు. కాంగ్రెస్ వైఫల్యాల వల్ల ఏర్పడుతున్న రాజకీయ శూన్యాన్ని భర్తీ చేయడానికి ఆయన చేస్తున్న ప్రయత్నాలన్నీ విఫలమౌతున్నాయి. అట్లని చంద్రబాబు చేష్టలుడిగి కూర్చుండి పోతున్నాడా అంటే, అది నిజం కాదు. ప్రతిరోజూ టీవీ ఛానళ్లతో మాట్లాతూనే వున్నాడు. పత్రికా ప్రకట



కొరవ 14వ పేజీలో



## టిజి వెళ్తేనే సంతకాలు!

రాయలసీమ హక్కుల ఉద్యమ నిర్మాతగా పేరెన్నికగన్న కర్నూలు కాంగ్రెస్ ఎమ్మెల్యే టిజి.వెంకటేష్ ఇప్పుడు అందరి దృష్టిని ఆకర్షిస్తున్నాడు. ముఖ్యమంత్రి రోశయ్య మీద ఆయనకు అనితర సాధ్యమైన పట్టు లభించడమే అందుకు కారణం. సిఎం పేషీలో వెంకటేష్‌కు రెడ్ కార్పెట్ స్వాగతం లభిస్తున్నది. సాధారణంగా సిఎంను కలవాలనుకొన్న ఎమ్మెల్యేలు, ఎమ్పీలు అపాయింట్‌మెంట్ లేకుండానే వెళ్లడం ఆనవాయితీ. కానీ రోశయ్య ఆ పద్ధతి తప్పించి, ముందుగా అనుమతి వున్న వారినే అనుమతిస్తున్నారు. రాజ్యసభ సభ్యుడు ఎఎం.ఖాన్ ఒకరోజు అపాయింట్‌మెంట్ లేకుండా వచ్చాడని, పేషీలోకి కూడా అడుగుపెట్టనివ్వలేదు సిబ్బంది. చాలా మంది ఎమ్మెల్యేలకు ఇదేపరిస్థితి ఎదురౌతున్నది. కానీ టిజి.వెంకటేష్‌కు మాత్రం ఆ ఇబ్బంది లేదు. ఇంట్లో అయినా, ఆఫీసులో అయినా ఆయన ఎప్పుడు కోరుకొంటే అప్పుడు స్వేచ్ఛగా వెళ్తున్నారు. టిజి చెప్తే, కాగితం ఏదనేది కూడా చూడకుండా సంతకాలు పెడుతున్నాడట ముఖ్యమంత్రి. మరే ఎమ్మెల్యే ఏ కోరికతో వెళ్లినా, నిధులు లేవు,

కొరవ 14వ పేజీలో

# సైన్యానికీ చెదలా?

బొంబాయి మహానగరంలోని ఒక ఆకాశ సౌధం నిర్మాణంలో భారత సైన్యానికి చెందిన అత్యున్నత అధికారులు అక్రమాలకు పాల్పడినట్లు వస్తున్న వార్తలు మనసును కలిచి వేస్తున్నాయి. కార్గిల్ యుద్ధంలో మరణించిన వీర సైనికుల కుటుంబాలకు ఆశ్రయం కల్పించడం కోసం సైన్యానికి చెందిన స్థలంలో ఇళ్లు నిర్మించాలని తలపెట్టారట. అయితే ఆ స్థలం బొంబాయి నగరంలోని అత్యంత సంపన్న ప్రాంతంలో వుండడంతో దీనిపై అందరి కళ్లూ పడ్డాయి. ముఖ్యమంత్రులు, మంత్రులు, ఐఎఎస్ అధికారుల వంటి పలుకుబడి కల్గిన వారంతా ఈ భవనంలో కాసింత చోటు సంపాదించారు. అది చూసి కొందరు సైనికాధికారులు కూడా ఇళ్లు కొట్టేశారు. వారిలో ఇద్దరు మాజీ సైన్యాధిపతులు కూడా వున్నారు. ఇంతమంది బడాబాబులు ఒకచోట చేరితే ప్రభుత్వ చట్టాలు, అన్ని రకాల నియమ నిబంధనలు తుంగలో తొక్కడం సహజంగా జరిగే పరిణామం. ఇక్కడా అదే జరిగింది. ఆరంతస్థుల భవనం కట్టడానికి అనుమతి తీసుకొని, ఏకంగా 31 అంతస్థుల ఆకాశ సౌధం నిర్మించారు. సముద్ర తీరంలో భారీ నిర్మాణాలపై వున్న పర్యావరణ నిషేధాలను స్వేచ్ఛగా ఉల్లంఘించారు. చూపుడుకు మాత్రం ఒకరిద్దరు కార్గిల్ అమరవీరుల కుటుంబాలకు ఇళ్లు కేటాయించి, తతిమావన్నీ దొంగలు దొంగలు ఊళ్లు పంచుకొన్నట్లు తమలో తాము పంచుకొన్నారు. ఇంగ్లీష్ దినపత్రికలు ఈ హేయమైన కుంభకోణాన్ని బయట పెట్టాయి. దానిపై చెలరేగిన ప్రజాగ్రహానికి మహారాష్ట్ర ముఖ్యమంత్రి అశోక్ చవాన్ కుర్చీ కదలి పోతున్నది. ఆయన తన అత్తగారి పేరిట ఒక ఇల్లు కొట్టేసినట్లు వెలుగులోకి వచ్చింది. కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ ఆయన్ను ఢిల్లీకి పిలిపించి, ఏమిటీ తప్పుడు తనమని గద్దించి, రాజీనామా లేఖ వ్రాయించారు. పదవి పోతున్నదనే బాధతో ఆయన ఇప్పుడు తనకంటే ముందు ముఖ్యమంత్రులుగా పనిచేసిన విలాసరావ్ దేశ్‌ముఖ్, సుశీల్‌కుమార్ షిండే వంటి కేంద్ర మంత్రులకూ ఈ పాపంలో వాటా వుందని చెప్తున్నాడు. తనతో పాటుగా వారికీ పదవులు వూడగొట్టాలన్నది చవాన్ అభిలాష.

రాజకీయవాదులు ఇటువంటి నీచాలకు పాల్పడడం ఒక ఆనవాయితీగా మారిపోయింది. కానీ నీతి, నిజాయితీ, నిబద్ధత, దేశభక్తి వంటి పదాలకు నిర్వచనం వలె మెలగవలసిన సైన్యాధికారులు కూడా ఇందులో భాగస్వాములు కావడం ఘోరమైన నేరం. ఇద్దరు మాజీ సైన్యాధిపతులతో సహా మొత్తం 35 మంది సైన్యాధికారులు నిబంధనలకు విరుద్ధంగా ఇళ్లు సంపాదించారని వార్తలొస్తున్నాయి. ఇప్పుడు సైన్యంపై పెత్తనం చేస్తున్న చీఫ్ జనరల్ దీపక్ కపూర్ కూడా ఇందులో ఇంటి కోసం దరఖాస్తు చేసుకొన్నాడని ఒక టీవీ ఛానల్ బయట పెట్టింది. ఇంతకంటే నీచము, ఇంతకంటే నేరము వేరొకటి వుండదు. ఈ వార్తలతో సైన్యం మీద దేశ ప్రజలకున్న గౌరవం ఒక్కసారిగా మంట కలిసి పోతున్నది. కేంద్ర రక్షణ మంత్రి ఎకె.ఆంటోనీ ప్రజాజీవితంలో పవిత్రతకు ఒక కొలమానం వంటివాడు. ఆయన ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణిస్తుండడం దేశ ప్రజలకు కొంతవరకు ఉపశమనం కల్గించే పూరట. ఈ ఆకాశ సౌధం నిర్మాణంలో జరిగిన అవకతవకలను, సైనికాధికారులు చేసిన అక్రమాలను పూర్తిగా వెలికితీయడానికి సమగ్ర దర్యాప్తుకు సిద్ధపడుతున్నాడు రక్షణ మంత్రి. దానికి భయపడిన మాజీ సైన్యాధిపతులు ఇద్దరూ తమ ఇళ్లను స్వచ్ఛందంగా వదలుకోవడానికి సిద్ధపడుతున్నారు.

ఈ అవినీతి కుంభకోణంతో సైన్యం పట్ల దేశ ప్రజలలో వున్న నమ్మకం క్షీణించే ప్రమాదం వుంది. ఆ పరిణామం దేశానికి ఎంత మాత్రం క్షేమం కాదు. సైన్యానికీ అవినీతి చెదలు పట్టిందన్న నిజాన్ని జీర్ణించుకోవడం చాలా కష్టం. రక్షణ మంత్రి, ప్రధానమంత్రి స్వయంగా జోక్యం చేసుకొని ఈ చెద పురుగులను నిర్మూలించడం తక్షణమే జరగాలి. అందులో ఏ మాత్రం ఆలస్యం చేసినా, అలసత్వం వహించినా దేశం మొత్తం నష్టపోతుంది. సైన్యం ప్రతిష్ఠను పెంచడానికి, దానిపట్ల ప్రజలలో విశ్వాసాన్ని కొనసాగించడానికి అందుబాటులో వున్న కఠినాతి కఠిన చట్టాలన్నిటినీ ప్రయోగించడం అవసరం.

కేంద్ర పర్యావరణ మంత్రి జైరాం రమేష్ కూడా దీనిపై తీవ్రంగానే స్పందించడం సంతోషం కల్గించే అంశం. పర్యావరణ అనుమతులు లేకుండా నిర్మించిన ఈ ఆకాశ సౌధం మొత్తాన్ని కూలగొట్టాలన్న ఆలోచనలో వున్నారట ఆయన. అది నిజంగా అమలు జరిగితే, అక్రమార్కులకు చెంపదెబ్బ కొట్టినట్లు అవుతుంది. ప్రజలు సంతోషిస్తారు.

జమీన్‌రైతు

## జనవాణి

### సమైక్యవాదుల సహనాన్ని పరీక్షించకండి!

భాషా ప్రయుక్త రాష్ట్రం కోసం 58 రోజులు నిరాహారదీక్ష చేసి ప్రాణత్యాగం చేసిన గొప్పవ్యక్తి పొట్టి శ్రీరాములు. హైదరాబాద్‌లోని తెలుగు విశ్వ విద్యాలయంలో పొట్టి శ్రీరాములు విగ్రహానికి నిప్పంటించడం దారుణం. టిఆర్ఎస్ నాయకులు ప్రభుత్వాన్ని ఒప్పించి కొమరం భీమ్ విగ్రహం ఎక్కడైనా పెట్టుకోవచ్చు. దీని కోసం ఆంధ్రప్రదేశ్‌ను సాధించి పెట్టిన పొట్టి శ్రీరాములు గారి పట్ల ఆయన విగ్రహాల పట్ల అమానుషంగా ప్రవరిస్తే సమైక్యవాదులు ఊరుకోరు.

కె.వి.చలమయ్య — నెల్లూరు

### వినాశనం తెచ్చే అభివృద్ధి!

ప్రపంచీకరణ తర్వాత మనదేశంలో విదేశీ పెట్టుబడులు పెరిగాయి. ఆర్థిక మండళ్ల పేరిట ప్రభుత్వం నుంచి చౌకగా వేల ఎకరాల భూమిని పొందుతున్న పారిశ్రామికవేత్తలు రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసుకొంటున్నారు. జిల్లాలో కృష్ణపట్నం ఓడరేవు దానితోపాటు కొన్ని పరిశ్రమలు వచ్చాయి. వీటికితోడు ముంబాయి మాఫియా కూడా దిగింది. భూవివాదాలు పెచ్చు పెరిగాయి. బంగారు పంట పండే పొలాలు, రొయ్యల చెరువులు పూడిపోయాయి. అపరిమిత సంఖ్యలో పెడుతున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల వల్ల ఎంత వినాశనం జరగబోతుందో ఎవరూ చెప్పలేక పోతున్నారు. వున్న వనరులతో బతికేస్తున్న నెల్లూరు జిల్లా ప్రజలను అభివృద్ధి పేరిట వినాశనమనే అగ్ని గుండంలోకి తోసేస్తున్నారు. కాని ప్రజలు ఇప్పుడిప్పుడే ఈ విషయాలను తెలుసుకొనేట్లు లేరు.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

### అమెరికా ఓ అద్భుత దేశం!

ప్రపంచ దేశాల్లోనే అమెరికా ఓ అద్భుత దేశమనవచ్చు. ఎన్నో రకాల వింతలు, విస్తరించిన సాంకేతిక పరిజ్ఞానం, వాతావరణంతోపాటు మనుష్యుల్లో మార్పులు ప్రస్ఫుటంగా కనపడతాయిక్కడ. చీమలు, దోమలు, ఈగలు, పాములు అసలు కనపడవు. చీమల బారుల్లా కార్లు; కాని వాటిని నియంత్రించను పోలీసులుండరు. అయినా ట్రాఫిక్ జామ్‌లు, ప్రమాదాలుండవు. పచ్చని చెట్లు, ఒత్తుగా పెరిగిన గడ్డి, ఎత్తైన భవనాలు, ఇరవైనాలుగు గంటలు విద్యుత్, మంచి అధికార వ్యవస్థకు తోడు న్యాయవ్యవస్థ అమెరికా ప్రత్యేకతలు.

నిడిముసలి దశరథరామిరెడ్డి — నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

8-11-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు వార్తలు

### నదీప్రవాహం

13తేది ఉదయం పెన్నానదికి 19 అడుగుల నీరు వచ్చింది. పదేళ్లుగా యింత ప్రవాహం ఎప్పుడూ రాలేదు.

### రైలుకట్ట తెగుట

గూడూరు – ఓడూరుల మధ్య రైలు కట్ట 7–8 అడుగులు తెగినట్టు కూడా తెలుస్తున్నది.

### బిట్రగుంట సెటల్మెంటులో కాల్పులు

ఈ సెటల్మెంటులో వుండే ఎరుకలు, దొమ్మరులు కొట్టుకున్నారు. పోలీసులు నాల్గుమార్లు కాల్చేస్తే మూడు మార్లు ప్రేలలేదు. గల్భా అణిగింది. 33గ్గురు అరెస్టు. ఇవి వెంకటగిరి సిపాయీల తుపాకుల మాదిరిగున్నవే.

### వెంకటగిరి కంచెల గలాటా

కంచెల విషయంలో వెనుకటి రాజీకి భిన్నంగా యాలాలు వెయ్యడం వగైరా తకరారులను గూర్చి కొందరు రైతులు వెళ్లి మహారాజ్ కుమార్ గారితో మాట్లాడినట్లును రాజీగా పరిష్కరించడానికి అనుకూలంగా వున్నట్లును కావున తక్కిన రైతులంతా చేరి తిరుగా మాట్లాడక వాయిదా వేసుకున్నట్లును తెలుస్తున్నది.

పాళెంకోట వగైరా కొండపాలుపు కొన్ని గ్రామాల రైతులు మాత్రం కంచెల యాలాల పద్ధతిని తీసుకోకుండా ఆక్షేపణతో నిలిచి వున్నది.

### పెన్నా బ్రిడ్జిమీద ఇద్దరు చనిపోయారు.

10తేదీ సాయంత్రం ఆరు గంటలప్పుడు రైల్వే బ్రిడ్జి మీద ఉత్తరదిక్కు నుండి దక్షణం వస్తూ ఎదురుగుండా వచ్చే ఇంజను క్రిందబడి నెల్లూరు డిప్టీ కలెక్టరు ఆఫీసు గుమాస్తా పాటూరు వెంకటసుబ్బారెడ్డిన్నీ ఒంగోలు నె 600 రు పోలీసు కానిస్టేబిలు మహబూబ్ సాహెబున్నూ ఈ యిద్దరు చనిపోయారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

4-11-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### సమితి అధ్యక్షునిపై అవిశ్వాసం

ఉదయగిరి పంచాయితీ సమితి అధ్యక్షుడు కె.వెంకటసుబ్బారెడ్డి గారిపై ప్రతిపాదింపబడిన అవిశ్వాస తీర్మానం 3తేది నెల్లూరు డిప్టీ కలెక్టరు అధ్యక్షతన జరిగిన సమావేశంలో చర్చించబడి ఆమోదింపబడింది. తీర్మానానికి అనుకూలంగా 32ఓట్లు, ప్రతికూలంగా 18 ఓట్లు వచ్చినవి.

తాలుకా కాంగ్రెసు కార్యదర్శి పల్లెకొండ ఓబయ్య కాంగ్రెసుకు రాజీనామా ఇచ్చి, స్వతంత్రులతో చేరి అవిశ్వాస తీర్మానానికి అనుకూలంగా పనిజేశాడట.

రాష్ట్రంలో ప్రప్రథమంగా అవిశ్వాస తీర్మానంతో సమితి అధ్యక్షుని తొలగిస్తున్న కీర్తి ఉదయగిరికి దక్కుతుంది.

### హోటళ్ల సమ్మె

కూరగాయల మీద లేని అమ్మకం పన్నును కొద్ది కాలంపాటు గూడా నిల్వజేయుటకు వీలులేని తినుపదార్థాల మీద విధిస్తున్నందుకు; ఆ పన్ను గూడా కేరళలో నూటికి 1రూపాయి, మద్రాసులో 2రూపాయలు వుండగా, ఆంధ్రలో నూటికి 3 రూపాయలు విధిస్తున్నందుకు–

సేల్సుటాక్సు అధికార్లు గత 28, 29తేదులలో హోటళ్లలో ప్రవేశించి, వంటగది మొదలు కౌంటరు వరకు పర్యవేక్షిస్తూ అవమానంగా ప్రవర్తించినందుకు–

ఈ అన్ని కారణాలతో 28తేది రాత్రి సమావేశమైన హోటల్ యాజమానుల సంఘం, వీటికి నిరసనగా 31తేది సమ్మె చేయుటకు నిర్ణయించి, ఆ విధంగానే హోటళ్లన్ని మూసివేయడం జరిగింది.

పన్నుల వ్యతిరేకత సమర్ధనీయమైనా కాకపోయినా, సేల్సుటాక్సు అధికార్లు హోటల్ యాజమానులను దొంగల వలె చూడడం, జులుం చేయడం ఏ మాత్రం సమర్ధనీయం గాదు. ఈ దృష్టితో చూచినపుడు హోటల్ యాజమానుల నిరసన సక్రమమేననిపిస్తుంది.

# నెల్లూరు ముచ్చట్లు

## కుంభవృష్టి!

జిల్లాలో అక్టోబర్ నెలలో సగటున కురవాల్సిన వర్షం కంటే ఎక్కువగా 29, 30, 31 తేదీల్లో కురవడంతో గందరగోళం నెలకొనింది. వాస్తవానికి ఈ నెలలో 23 సెంటీమీటర్ల వర్షం కురవాల్సి వుండగా 29 సెంటీమీటర్లు కురిసింది. వెంకటాచలం మండలంలో నెల చివరి మూడు రోజుల్లో 88.9 సెంటీమీటర్ల వర్షం పడగా, దగదర్తిలో 45.4, కోవూరు 41, ఇందుకూరుపేటల్లో 39.9, నెల్లూరులో 38 సెంటీమీటర్ల వర్షం పడింది. అత్యల్పంగా సీతారాంపురంలో మూడు సెంటీమీటర్ల వర్షం కురిసింది. జిల్లాలోని 46 మండలాల్లో కురిసిన వర్షపాతం వివరాలు దిగువనిస్తున్నాం... పరిశీలించండి.

వెంకటాచలం – 88.9 సెంటీమీటర్లు, దగదర్తి – 45.4, కోవూరు – 41.9, ఇందుకూరుపేట – 39.1, నెల్లూరు – 38.8, బుచ్చి – 36.8, విడవలూరు – 35.5, బోగోలు –35.5, సంగం – 34.2, తోటపల్లి గూడూరు – 31.5, అల్లూరు – 28.9, ముత్తుకూరు – 26.8, కావలి–25.4, జలదంకి–25.3, కొడవలూరు – 23.6, చిట్టమూరు – 23.6, ఏఎస్‌పేట – 22.7, నాయుడుపేట – 21.4, కోట – 21.2, తడ – 19.9, చేజర్ల – 19.7, ఆత్మకూరు – 19.6, పొదలకూరు – 19.3, సూళ్లూరుపేట – 18.6, గూడూరు – 18.4, మనుబోలు – 17.8, డివిసత్రం – 17.6, ఓజిలి – 17.0, పెళ్లకూరు – 16.8, చిల్లకూరు – 16.0, వెంకటగిరి – 15.9, కొండాపురం – 15.1, రాపూరు – 14.7, కలిగిరి–14.3, బాలాయపల్లి – 13.7, సైదాపురం – 13.3, వాకాడు – 22.9, దక్కిలి – 10.5, వింజమూరు – 10.5, కలువాయి – 8.8, అనంతసాగరం – 8.6, వరికుంటపాడు – 7.0, దుత్తలూరు – 6.8, మర్రిపాడు – 6.6, ఉదయగిరి – 5.2, సీతారాంపురం – 3.8 సెంటీమీటర్లుగా నమోదయ్యింది.

## వర్షం వల్ల నష్టం 100 కోట్లు!

జిల్లాలో గతవారం కురిసిన భారీ వర్షాల మూలంగా 100 కోట్ల రూపాయల నష్టం వాటిల్లినట్లు అధికారులు నివేదిక తయారు చేశారు. రోడ్లు బాగా దెబ్బతిన్నాయని, నీటిపారుదల శాఖకు సంబంధించిన వనరులు, కొంతమేర మెట్ట పంటలకు నష్టం వాటిల్లినట్లు జిల్లా కలెక్టర్‌కు ఆయా శాఖలు నివేదికను అందించాయి. ఒక్క నెల్లూరు నగరంలోనే 15.22 కోట్ల రూపాయల నష్టం జరిగినట్లు అధికారులు తమ నివేదికలో స్పష్టం చేశారు.

## నిండుగా సోమశిల!

సోమశిల పరివాహక ప్రాంతాల్లోనూ భారీవర్షాలు పడడంతో ప్రాజెక్ట్‌లో గరిష్టస్థాయి నీటిమట్టం 58 టిఎంసిలకు చేరుకొంది. కడప జిల్లా రాజోలు బండ, ఆదినిమ్మాయపల్లి, చెన్నూరుల నుంచి వచ్చిన వర్షపు నీటితో ప్రాజెక్టు నిండు గర్భిణిలా వుంది. ప్రస్తుతం సోమశిల నుంచి కండలేరుకు 2200 క్యూసెక్కులు, దక్షిణ కాలువకు 200 క్యూసెక్కుల నీటిని విడుదల చేస్తున్నారు. నవంబర్ నెలాఖరుకు ప్రాజెక్ట్ పూర్తిస్థాయి నీటిమట్టానికి చేరేటట్లుంది.

## ఒంటిపై కిరోసిన్ పోసుకొన్న ముంగర!

నెల్లూరులో ఎప్పటి నుంచో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అభిమాని అయిన ముంగర విజయకుమార్ హరనాథపురం సెంటర్‌లో వైఎస్ విగ్రహం ఏర్పాటుకు కార్పొరేషన్ అధికారుల అనుమతి నిరాకరణను నిరసిస్తూ ఒంటిపై కిరోసిన్ పోసుకొని కాల్చుకొనే ప్రయత్నం చేశాడు. చుట్టు ప్రక్కల వాళ్లు వెంటనే అడ్డుకొని ఆర్పివేయడంతో ముంగర ప్రాణాపాయం నుంచి తప్పించుకొన్నాడు. పోలీసులు మాత్రం ఇతనిపై ఆత్మహత్యానేరంపై కేసు పెట్టారు.

## ధర బాగా పెరిగిన ఉల్లి – వెల్లుల్లి!

కూరల్లో ఉల్లి – వెల్లుల్లి తగిన మోతాదులో పడకపోతే ఆ కూర రుచించదు. శాకాహారులు, మాంసాహారులు ఎవరైనా సరే ఉల్లి – వెల్లుల్లి వాడక తప్పని పరిస్థితి. కానీ ఈ రెండు నిత్యావసరాల రేట్లు అనూహ్యంగా పెరిగిపోయాయి. రెండు నెలల క్రితం వరకు కిలో ఎనిమిది, పది రూపాయల మధ్య దొరుకుతుండిన ఉల్లిపాయలు ఈ వారంలో ఏకంగా 30 రూపాయలయ్యాయి. వెల్లుల్లి కూడా తానేమీ తక్కువా అన్నట్లు కిలో 80 రూపాయల నుంచి ఏకంగా 160 రూపాయలయ్యింది. మొత్తం మీద ఉల్లి – వెల్లుల్లి సామాన్య, మధ్యతరగతీయులకు అందుబాటులో లేనివిధంగా తయారయ్యాయి.

## స్వగ్రామానికి సోమిరెడ్డి!

అకస్మాత్తుగా అస్వస్థుడై గుండెకు యాంజియోప్లాస్టీ చేయించుకొన్న జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి 31వ తేది నెల్లూరు వచ్చారు. రైల్వేస్టేషన్‌లో తెలుగు నేతలందరూ ఆయనకు ఘన స్వాగతం పలికారు. చంద్రమోహన్‌రెడ్డి అందర్నీ ఉత్సాహంగా ఉల్లాసంగా పలకరిస్తూ స్వగ్రామం అల్లీపురంలో ప్రస్తుతం విశ్రాంతి తీసుకొంటున్నారు.

## సిపిఎం నేతల విడుదల!

కలెక్టరేట్ ముట్టడించిన వ్యవహారంలో సిపిఎం నేతలను తీవ్రంగా కొట్టిన పోలీసులు అంతటితో ఊరుకోకుండా 23 మందిపై నాన్‌బెయిలబుల్ కేసులు నమోదు చేసి జైలుకు పంపారు. వీరంతా బెయిల్ పిటిషన్ పెట్టుకోవడంతో న్యాయమూర్తి ఐదు వేల చొప్పున ఇద్దరి పూచీకత్తుతో 1వ తేది విడుదల చేశారు. విడుదలైన నేతలు మోహన్‌రావు, మాజీ డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు, మాజీ కార్పొరేటర్లు కత్తి శ్రీనివాసులు, మస్తాన్‌బీ తదితరులు సెంట్రల్ జైలు నుంచి గాంధీబొమ్మ వరకు పార్టీ కార్యకర్తలతో కలిసి ర్యాలీ నిర్వహించి రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డిపై మొటికలు విరిచారు.

## అస్వస్థతకు గురైన అదనపు జెసి!

అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య అస్వస్థులయ్యారు. తలలోని నరంలో రక్తం గడ్డకట్టడంతో నెల్లూరు నారాయణ హాస్పిటల్‌లో వైద్య పరీక్షల అనంతరం హైదరాబాద్‌లోని కిమ్స్ ఆస్పత్రికి తరలించారు. అక్కడ ఆయనకు విజయవంతంగా శస్త్రచికిత్స నిర్వహించారు. అదనపు జెసి త్వరగా కోలుకొని విధులకు హాజరవ్వాలని కోరుకొంటున్నాం.

కొరవ 14వ పేజీలో

## తండ్రి కోరిక తీర్చిన తనయులు

**ముత్తుకూరులో జగన్ చేతుల మీదుగా వైఎస్ విగ్రహావిష్కరణ!**

ముత్తుకూరు మండలం మొల్లూరు గ్రామానికి చెందిన కుమ్మరమిట్ట గోపాలకృష్ణారెడ్డి (74) తెలుగుదేశం పార్టీ అభిమాని. ఆయన సతీమణి శకుంతలమ్మ మొల్లూరు గ్రామ సర్పంచ్. ముఖ్యమంత్రిగా వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో ఆ గ్రామంలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు జరిగాయి. దీంతో రాజశేఖర్‌రెడ్డి చనిపోయిన తర్వాత వైఎస్.జగన్మోహన్‌రెడ్డి ఓదార్పు యాత్రను పురస్కరించుకొని ముత్తుకూరులో ఆయన విగ్రహం పెట్టాలని తలపోశారు. కాని ముత్తుకూరు కాంగ్రెస్ నాయకులు దీనికి ససేమిరా అన్నారు. దీంతో గోపాలకృష్ణారెడ్డి ఇవన్నీ ప్రక్కనపెట్టి వైఎస్ విగ్రహాన్ని పెట్టను ముందుకొచ్చారు. మళ్లీ రాజకీయం పని చేసింది. ముత్తుకూరు సెంటర్‌లో విగ్రహం పెట్టను పంచాయితీ ఒప్పుకోకపోవడంతో ఆఫీసుకు ఎదురుగా వున్న గోపాలకృష్ణారెడ్డి సొంత స్థలంలో విగ్రహ ఏర్పాటుకు సిద్ధమయ్యారు. భూమి పూజ చేశారు. అంతే రాజకీయ మానసిక ఒత్తిడితో మరుసటిరోజే గుండెపోటు వచ్చి ఆయన ప్రాణాలు తీసింది. అంతే విగ్రహ నిర్మాణం ఆగిపోయింది.

కాని గోపాలకృష్ణారెడ్డి చివరి కోరికను తీర్చను ఆయన కుమారులు విజయకుమార్‌రెడ్డి, హేమంత్‌కుమార్‌రెడ్డి, హరిప్రసాద్‌రెడ్డి కృతనిశ్చయంతో ముందుకొచ్చారు. నవంబర్ 2తేది అశేష జనవాహిని మధ్య వైఎస్.జగన్మోహన్‌రెడ్డి చేతుల మీదుగా విగ్రహావిష్కరణ జరిగింది. ఆవిష్కరణకు ముందు సభికులంతా గోపాలకృష్ణారెడ్డి స్మృత్యంకంగా రెండు నిమిషాలు మౌనం పాటించారు. ఈ సందర్భంగా జగన్మోహన్‌రెడ్డి మాట్లాడుతూ బతికివున్నప్పుడు జేజేలు కొట్టించుకోవడం గొప్పకాదు. చనిపోయిన తర్వాత ఎంత మంది గుండెల్లో బతికివున్నామన్నదే గొప్ప అనేందుకు అటు వైఎస్, ఇటు గోపాలకృష్ణారెడ్డిలే ఉదాహరణ అని శ్లాఘించారు.

ఏదైతేనేం ముత్తుకూరులో వైఎస్ విగ్రహస్థాపనలో గోపాలకృష్ణారెడ్డి పేరు చిరస్థాయిగా నిలిచిపోయింది.

• ఇందిరమ్మ నివాళికి

# నాలుగు గ్రూపులయ్యారు!

## నెల్లూరులో కాంగ్రెస్ పరిస్థితిది!



ఆర్టీసి వద్ద వివేకా బృందం నివాళి.

నెల్లూరులో కాంగ్రెస్ పార్టీ పరిస్థితి ఎవరికివారే యమునాతీరే అన్నట్లుగా వుంది. ఈ వ్యవహారం మాజీ ప్రధాని స్వర్గీయ ఇందిరాగాంధీ 26వ వర్ధంతి సందర్భంగా బహిరంగంగా వెల్లడయ్యింది. సహజంగా ఇందిరమ్మ వర్ధంతిని పార్టీ నాయకులంతా కలసి ఇందిరాభవన్‌లో నిర్వహించేవారు. ఈసారి ఆ మహానాయకురాలికి రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అయితే ఇందిరాభవన్ గడప తొక్కను ఇష్టపడక ఆర్టీసి బస్టాండ్ వద్దనున్న ఇందిరమ్మ విగ్రహానికి రోజాపూల మాలవేసి సరిపెట్టాడు. పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నగరంలో వుండినా ఇందిరమ్మకు నివాళులర్పించే తీరిక లేకపోయింది. డిసిసి అధ్యక్షుడు ఎల్లసిరి గోపాలరెడ్డి నేతృత్వంలో నలుగురంటే నలుగురు ఇందిరాభవన్‌లోని ఇందిరమ్మ విగ్రహానికి పూలమాల వేసి సరిపెట్టారు. జడ్పీ మాజీ ఛైర్మన్ చెంచల బాబు నేతృత్వంలో బిసి నేతలు రఘురాం, ఉడతా వెంకట్రావ్ తదితరులు ఓ గ్రూపుగా నివాళులర్పించగా వీరితో మహిళా కాంగ్రెస్ జిల్లా అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ జత కలిశారు. వీరి తర్వాత యువజన కాంగ్రెస్ జిల్లా అధ్యక్షుడు కోటీశ్వరరెడ్డి నేతృత్వంలో మరో బృందం ఇందిరాభవన్‌లోని ఇందిరమ్మ విగ్రహానికి నివాళులర్పించటం చర్చనీయాంశమయ్యింది. వివేకానందరెడ్డి నివాళిలో మాత్రం పార్టీ కార్యకర్తలు కాస్త కన్పించారు. నేతల్లో విభేదాలుండవచ్చు. కానీ వీరందరికి అధికార పదవులు, హోదాలు కల్పించిన పార్టీ నేత ఇందిరమ్మ నివాళికి ఒక సభ కూడా జరిపే దిక్కులేకుండా పోయింది. అదే అసలైన కాంగ్రెస్ పార్టీ అభిమానుల బాధ. దీన్నెవరు తీరుస్తారు?



ఇందిరాభవన్‌లో నివాళులర్పిస్తున్న బిసి నేతలు.

# గ్యాస్ సిలిండర్లకు కటకట!

## ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్న ఏజన్సీలు.

నెల్లూరు నగరంలోని ప్రజలు గ్యాస్ సిలిండర్లకు నానా పాట్లు పడాల్సి వస్తుంది. బుక్‌చేసిన వారికి 25 రోజులకు కూడా గ్యాస్ సిలిండర్లు పంపిణీ చేయడం లేదు. నగరంలో కృష్ణ, కల్పన, పద్మశ్రీ, విజయ, రెడ్డి అండ్ రెడ్డి, డి.కె, శుభ, భార్గవి, ఏపిసిసిసి(ఐఓసి) గ్యాస్ ఏజెన్సీలున్నాయి. గతంలో బుక్‌చేసిన వారికి వారం పది రోజులకు గ్యాస్ సిలిండర్లు ఇచ్చేవారు. ప్రస్తుతం పాతిక రోజులకుగానీ పంపిణీ చేయడం లేదు. పత్రికల్లో మాత్రం బుక్‌చేసిన 20 రోజులకు సిలిండర్లు ఇస్తున్నట్లు వివిధ ఏజెన్సీలు సీరియల్ నెంబర్లు ఇస్తాయి. కానీ ఈ విషయమై ప్రశ్నించను వినియోగదారులు ఫోన్‌చేస్తే ఎత్తేవారు వుండరు. వాతావరణం ఒక్కసారిగా మారడంతో ఇళ్లలో రకరకాల వినియోగం కోసం గ్యాస్‌ను వినియోగించడం ఎక్కువయ్యింది. బుక్‌చేసిన 25 రోజులపైన అదీ వినియోగదారులు వెంటపడితే సిలిండర్లు ఇస్తుండడంతో సింగిల్ సిలిండర్లు వున్నవారి బాధలు వర్ణనాతీతంగా వున్నాయి. నగరంలో గ్యాస్ ఏజెన్సీల నిర్వాహకులు మహా ముదుర్లు. పంపిణీ చేసినట్లు బిల్లు కీట్‌చేసి సిలిండర్లు మాత్రం బ్లాక్ మార్కెట్‌కు తరలించే ఘనులు. వీరికి ఇటు జాయింట్ కలెక్టర్ అటు పౌరసరఫరాల శాఖాధికారులంటే భయం లేకుండా పోయింది. గ్యాస్ ఏజెన్సీలను తనిఖీచేసే అధికారులే లేకుండా పోవడంతో వారు ఆడిందే ఆట పాడిందే పాటగా వుంది.



సకాలానికి రాని గ్యాస్.

# జగన్ ఓదార్పుకు అరుణమ్మ!

## మనసు మారిందేమిటి?



గొట్లపాళెంలో జరిగిన వైఎస్ విగ్రహావిష్కరణలో జగన్.

సుదీర్ఘకాలంగా మహిళా కాంగ్రెస్ జిల్లా అధ్యక్షురాలిగా పనిచేస్తున్న పందిళ్లపల్లి అరుణమ్మ అక్టోబర్ 29వ తేది వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఓదార్పు యాత్రకు హాజరయ్యింది. వివాదాలకు దూరంగా వుండే అరుణమ్మ దగదర్తి మండలం పెద్దపుత్తేడు పంచాయితీ మజరా గొట్లపాళెంలో జరిగిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహావిష్కరణలో పాల్గొంది. ఆమెను జగన్ తన వెంట యాత్రలో ఇకనుంచి పాల్గొనమని కోరినట్లు తెలిసింది. తొలి నుంచి నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి అనుచరురాలిగా వున్న అరుణమ్మను కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి బాగా దగ్గరకు తీసినా ఆమెతో కలసి నడవలేదు. ఆనం సోదరులు పలుమార్లు అవమానించినా పార్టీలో సర్దుకొని వుండి పోయింది. పార్టీలో ఎన్నో ఆటుపోట్లు భరించిన అరుణమ్మ గొట్లపాళెంలో జరిగిన ఓదార్పు సభలో పాల్గొనడం యాదృచ్ఛికమేనా అనే సందేహం పార్టీ కార్యకర్తల్లో వుంది. తన అల్లుడు చెర్లో కోటారెడ్డి ఒత్తిడి మేరకు వైఎస్ విగ్రహావిష్కరణలో పాల్గొన్నట్లు అరుణమ్మ చెబుతుంది. దీన్ని నిజమని నమ్మదామా? లేకుంటే అరుణమ్మ కూడా మారిపోయిందందామా??

# డిఇఓ ఆఫీసులో దళారుల రాజ్యం!

## ప్రతి పనికి లంచమివ్వాల్సిందే!

జిల్లా విద్యాశాఖ కార్యాలయంలో దళారుల రాజ్యం నడుస్తోంది. గతంలో ఎన్నడూ, ఏ డిఇఓ కాలంలో లేనివిధంగా పలువురు దళారులు పెత్తనం చేస్తున్నారు. గతంలో మండల విద్యాశాఖాధికారిని కొట్టి వివాదాస్పదుడైన ఒక ఉపాధ్యాయుడు ఈ దళారుల్లో ముఖ్యుడు. ఈ ఉపాధ్యాయుడి వ్యవహారం చూసిన అధికారులు అతన్ని దూరంగా పెట్టారు. కానీ ప్రస్తుత డిఇఓ గారికి ఆ ఉపాధ్యాయుడు చాలా నచ్చినట్లున్నాడు. ఏ డిఇఓ ఇవ్వనంతగా అతనికి ప్రాధాన్యతనిస్తుండడంతో ఏ పని కావాలన్నా ఈ దళారీ ఉపాధ్యాయుడిని కలవాల్సి వస్తోందని ఉపాధ్యాయులు వాపోతున్నారు. ఇక విద్యాశాఖ సిబ్బంది లంచావతారం శృతిమించిపోతోంది. ఎవరు ఏ పని మీద వచ్చినా డిస్పాచ్ సెక్షన్ నుంచి ప్రతి ఒక్కరికీ చేయితడపందే ఫైలు కదలదు. ఇటీవల విఆర్ హైస్కూల్ అటెండర్ పనిమీద డిఇఓ కార్యాలయానికి వెళ్తే ఆ పని చేసిపెట్టను, డిస్పాచ్‌లో ఒక క్లర్కు డబ్బులు అడగడంతో పాపం ఆ అటెండర్ కళ్లు తేలేశాడు. దీంతో ఇద్దరి మధ్య గొడవకు దారితీయడంతో విద్యాశాఖ పరువు బజారున పడింది. చివరకు రిటైరైన వారినీ వదలడం లేదు. ఎంఇఓలు, హైస్కూలు ప్రధానోపాధ్యాయులు రిటైరైతే ఆర్‌విఎం, డిఇఓ కార్యాలయం నుంచి క్లియరెన్సు తీసుకొని తమకు రావాల్సిన బెనిఫిట్ల కోసం ఫైళ్లు పంపాలి. దీనికైతే 20వేల రూపాయల నుంచి అధిక మొత్తం నిలబెట్టి వసూలు చేస్తున్నారట. ఈ గొడవలతో పాపం నిఖార్సుగా ఉద్యోగం చేసే ఒకరిద్దరు నలిగిపోతున్నారు. యథా ఉన్నతాధికారి తథా సిబ్బంది అన్నట్లుంది విద్యాశాఖ పరిస్థితి.

▶ సాదాసీదాగా

# రాష్ట్ర అవతరణ దినోత్సవం!



## వేడుకలకు రాని జనం



వేడుకల్లో పొట్టిశ్రీరాములు చిత్రపటానికి నివాళులర్పిస్తున్న మంత్రి రామనారాయణరెడ్డి.

రాష్ట్ర అవతరణ దినోత్సవమనే సర్కారీ మొక్కుబడి కార్యక్రమం 1వ తేది పోలీస్ పెరేడ్‌గ్రౌండ్‌లో జరిగిపోయింది. ఈ కార్యక్రమానికి జిల్లా అధికారులు షామియానాలు, కుర్చీలువేసి, ఇతర ఏర్పాట్లను ఘనంగా చేసారేగానీ ఈ వేడుక చూసేందుకు జనం పలుచగా హాజరయ్యారు. వేర్పాటువాదం ఊపందుకొంటున్న వేళ ఈ వేడుకకు జనం హాజరయ్యేలా చర్యలు తీసుకోవడంలో అధికారగణం విఫలమయ్యింది. ముఖ్య అతిథిగా విచ్చేసి ఊకదంపుడు ఉపన్యాసం ఇచ్చిన పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఉపన్యాసంలో ప్రత్యేకత ఏమీలేదు. మంత్రి మాట్లాడుతూ రాష్ట్ర అవతరణ కోసం ప్రాణత్యాగం చేసిన మహనీయుడు అమరజీవి పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లావాసి కావడం గర్వకారణమన్నారు. వ్యవసాయం మీద ఆధారపడి జీవించే నెల్లూరు జిల్లాలో ఈ సీజన్‌లో ఎరువులు, విత్తనాలకు ఎటువంటి కొరత లేకుండా 25,400 టన్నుల ఎరువులు, 76వేల క్వింటాళ్ల విత్తనాలు పంపిణీకి సిద్ధంగా వున్నాయన్నారు. జిల్లాలో మైక్రోఫైనాన్స్ సంస్థలను అదుపులో పెట్టినట్లు మంత్రి చెప్పారు. ఇందిరమ్మ గృహనిర్మాణ పథకం క్రింద జిల్లాలో మూడు విడతలుగా 2,37,639 గృహాలు చేపట్టగా 1,30,549 గృహాలు పూర్తిచేసి మన జిల్లా రాష్ట్రంలోనే ఆరవస్థానంలో నిలిచిందన్నారు. ఇందిరమ్మ గ్రామాలలో నిర్మించిన ఇళ్లకు త్రాగునీటి వసతి, రోడ్ల నిర్మాణం, విద్యుత్తు లాంటి మౌలిక సదుపాయాలు కల్పించేందుకు రూ.14.69 కోట్లు కేటాయించామన్నారు. డిఆర్‌డిఏ, ఎస్సీ కార్పొరేషన్, ఐటిడిఏ, వికలాంగులు, ఐసిడిఎస్, అర్బన్ ఐకెపిల ద్వారా 1699 మంది లబ్ధిదారులకు 21 కోట్ల రూపాయల మేర వివిధ ఉపకరణాలను ఈ సందర్భంగా మంత్రి పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, పలు అధికార, అనధికార ప్రముఖులు పాల్గొన్నారు.

# నెల్లూరులో మైక్రో ఫైనాన్స్ సంస్థల వెనకడుగు!

**జిల్లాలో స్వయం సహాయక సంఘాల ద్వారా మహిళలు పొందిన రుణం 85కోట్ల రూపాయలు. అదే మైక్రో ఫైనాన్స్ సంస్థలు 260 కోట్లు రుణంగా ఇచ్చాయి. ఈ సంస్థల నియంత్రణకు ప్రభుత్వం జారీ చేసిన ఆర్డినెన్స్ నేపథ్యంలో రుణాలివ్వడం, వసూలు చేయడం ఆగి మహిళలే ఇబ్బంది పడడం విశేషం.**

సూక్ష్మ రుణ సంస్థల నియంత్రణ కోసం ప్రభుత్వం జారీ చేసిన ఆర్డినెన్స్ నేపథ్యంలో రుణాల వసూళ్లు యాభై శాతం నిలిచిపోయాయి. రాష్ట్రవ్యాప్తంగా చోటుచేసుకొన్న పరిణామాల మూలంగా రుణాలను వసూలుచేసే సిబ్బంది గ్రామీణ ప్రాంతాలకు వెళ్లడం మానేశారు. దీంతో వసూలు కావాల్సిన రుణాలు స్తంభించిపోయాయి. మరో ప్రక్క తీసుకున్న రుణాలను చెల్లించవద్దంటూ ప్రతిపక్ష నేతలు ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నారు. ఇప్పటి నుంచి కొత్త మైక్రోఫైనాన్స్ సంస్థలు కొత్తగా రుణాలు ఇవ్వాలంటే అధికారుల నుంచి ముందుగా అనుమతి తీసుకోవాలని ప్రభుత్వం ఆదేశించింది.

మైక్రోఫైనాన్స్‌లకు సంబంధించి ప్రభుత్వం ఆర్డినెన్స్ జారీ చేయడంతో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, పట్టణ ఇందిర క్రాంతి పథం కార్యాలయాల్లో తప్పనిసరిగా కార్యకలాపాల వివరాలను తెలియజేసి రిజిస్ట్రేషన్ చేయించుకోవాల్సి వుంటుంది. రాష్ట్ర ప్రభుత్వం జారీచేసిన ఆర్డినెన్స్‌ను సవాల్ చేస్తూ మైక్రోఫైనాన్స్ సంస్థలు రాష్ట్ర హైకోర్టును ఆశ్రయించాయి. హైకోర్టు అన్ని విషయాలను సమగ్రంగా పరిశీలించి తదుపరి ఉత్తర్వులు జారీచేసేవరకు మైక్రోఫైనాన్స్ సిబ్బందిని అరెస్టు చేయరాదని ఉత్తర్వులిచ్చింది. దీంతో యధాతథంగా తమ కార్యకలాపాలను నిర్వహించాలని సంస్థలు భావించినా సిబ్బంది మాత్రం ప్రజల ఆగ్రహానికి ఎక్కడ గురికావాల్సి వస్తుందోనని భయపడి గ్రామాలకు వెళ్లడం లేదు.

పట్టణ ప్రాంతాలకు సంబంధించి కూడా ఇందిర క్రాంతి పథం అర్బన్ ప్రాజెక్టు డైరక్టర్ కార్యాలయంలో రిజిస్ట్రేషన్ చేయించుకొని అనంతరం ఆర్థిక లావాదేవీలు నిర్వహించాల్సి వుంటుంది. పట్టణ ప్రాంతాలలో లావాదేవీలు నిర్వహించేందుకు ఏడు మైక్రోఫైనాన్స్ సంస్థలు రిజిస్ట్రేషన్ కోసం దరఖాస్తు చేసుకొన్నాయి. స్ఫూర్తి, స్పందన, ఎస్‌కెఎస్, షేర్ మైక్రోఫైనాన్స్, ప్రేరణ, ఫ్యూచర్ ఫైనాన్షియల్ సర్వీసెస్ తదితర సంస్థలు దరఖాస్తు చేసుకొన్న వాటిలో వున్నాయి. స్వీకరించిన దరఖాస్తులను సమగ్రంగా పరిశీలించి అనుమతి మంజూరు చేసే అవకాశం వుంది.

గ్రామీణ ప్రాంతాలలో ప్రజలకు రుణాలు అందించి కార్యకలాపాలు నిర్వహించేందుకు 12 సంస్థలు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ కార్యాలయంలో దరఖాస్తులు సమర్పించాయి. వాటిపై ఇంకా ఎటువంటి నిర్ణయం తీసుకోలేదు. జిల్లాలో బ్యాంకులతో సమానంగా మైక్రోఫైనాన్స్ సంస్థలు ఆర్థిక లావాదేవీలు చేపట్టాయి. ప్రభుత్వం జారీచేసిన ఆర్డినెన్సుకు అనుగుణంగా నడుచుకోవాలంటే రుణాలు తగ్గుముఖం పట్టే అవకాశం వుంది. ఒక సంస్థలో రుణం పొందాలంటే డిఆర్‌డిఏగాని లేదా పట్టణ ఐకెపి పిడి నుంచి అనుమతి పొందాలి. ఒక సంస్థ నుంచి రుణం పొందిన మహిళ, మరో సంస్థలో రుణం పొందడానికి వీలుండదు.

ఇందిర క్రాంతి పథం నుంచి పావలావడ్డీ రుణం పొందినవారు కూడా మైక్రోఫైనాన్స్ సంస్థల నుంచి రుణం తీసుకొనేందుకు అనర్హులుగా నిర్ణయించారు. మండల స్థాయిలో సంఘమిత్ర సిబ్బంది వాటి కార్యకలాపాలపై పర్యవేక్షణచేసే విధంగా ఆర్డినెన్స్ జారీ అయ్యింది. ఆర్డినెన్స్‌లో పేర్కొన్న నిబంధనల ప్రకారం రుణాలు ఇవ్వడం కష్టతరంగా మారనుంది. ప్రభుత్వం నుంచి దాదాపు 85 కోట్ల రూపాయలు స్వయం సహాయక సంఘాలకు మంజూరు కాగా మైక్రోఫైనాన్స్ సంస్థలు దాదాపు 260 కోట్ల రూపాయలు అందించాయి. ప్రభుత్వం, బ్యాంకుల నుంచి రుణాలు సకాలంలో అందకపోవడంతో ప్రజలు మైక్రోఫైనాన్స్ సంస్థలను ఆశ్రయిస్తున్నారు. పావలా వడ్డీ రుణాలు కేవలం కాగితాలకే పరిమితమవుతున్నాయి. రూపాయి వంతున వడ్డీ చెల్లించిన వారికి సంవత్సరం నుంచి ప్రభుత్వం బకాయిలు చెల్లించలేదు. ఇదిలా వుండగా 2001 సంవత్సరం నుంచి జిల్లాలో మైక్రోఫైనాన్స్ సంస్థలు ఆర్థిక లావాదేవీలు సాగిస్తున్నాయి. ఈ సంస్థలు ప్రజల నుంచి అధిక వడ్డీ వసూలు చేస్తున్న విషయం ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లినా కూడా నియంత్రించ లేకపోయింది. తొమ్మిది సంవత్సరాల అనంతరం ప్రభుత్వం స్పందించి వాటి నియంత్రణకు ఆర్డినెన్స్ తీసుకురావడం శుభపరిణామం అయినప్పటికీ ఎంత వడ్డీ వసూలు చేయాలన్న విషయాన్ని మాత్రం పేర్కొన లేదు.



బుచ్చిరెడ్డిపాళెంలోని మైక్రో ఫైనాన్స్ కార్యాలయం (ఫైల్‌ఫోటో).

# జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ భవిత ప్రశ్నార్థకం!

**ప్రపంచ బ్యాంక్ నిధులతో గ్రామీణాభివృద్ధి సంస్థలో నడుస్తున్న వివిధ పథకాలకు వచ్చే ఏడాది సెప్టెంబర్‌కు గడువు ముగుస్తుంది. ఆ తర్వాత ఇందిర క్రాంతి పథం వంటి పథకాల భవిష్యత్తు ప్రశ్నార్థకమేననాలి.**

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ భవిత ప్రశ్నార్థకంగా మారనుంది. గ్రామీణ ప్రాంతాల్లో పేదరికాన్ని నిర్మూలించాలన్న లక్ష్యంతో ప్రపంచ బ్యాంకు నిధులు విడుదల చేసింది. అప్పటి తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో "వెలుగు" అనే పథకం ప్రవేశపెట్టారు. 2004 సంవత్సరంలో అధికారం చేపట్టిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కూడా ఈ పథకానికి మరింత సహకారం అందించారు. 2005వ సంవత్సరంలో వెలుగు పేరును "ఇందిరాక్రాంతిపథం"గా మార్పు చేశారు. ఈ పథకం అమలు బాధ్యతను జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థకు ప్రభుత్వం అప్పగించింది. పట్టణ ప్రాంతాల్లోని మురికి వాడలలో నివాసం వుంటున్న వారికి ఆర్థికంగా చేయూత నివ్వాలన్న సంకల్పంతో అర్బన్ ఐకెపిని స్థాపించడం జరిగింది.

ప్రపంచ బ్యాంకు నిధులతో ఈ పథకం ప్రారంభించి దాదాపు 9 సంవత్సరాలు గడిచింది. వచ్చే సంవత్సరం సెప్టెంబర్ నాటికి పథకం గడువు ముగిస్తుంది. ఈ గడువు తర్వాత ఇందిరక్రాంతి పథం పరిస్థితి ఏమిటన్నది ప్రశ్నగా మారింది. మరో ఐదేళ్లపాటు ఈ పథకం గడువు పొడిగించాలని ప్రభుత్వం భావిస్తుంది. అయితే ఇందుకు ఆర్థికశాఖ అడ్డు తగులుతున్నట్లు తెలుస్తుంది. పేదరిక నిర్మూలన కోసం ప్రపంచ బ్యాంకు కేటాయించిన నిధులను ఇతర పనులకు, అవసరాలకు కేటాయించాలన్నది ఆర్థికశాఖ వుద్దేశంగా కనిపిస్తుంది.

గ్రామీణ ప్రాంతాలతోపాటు పట్టణ ప్రాంతాల్లో నివాసం వుంటున్న పేదలందరిని ఇందిరక్రాంతి పథంలో సభ్యులుగా చేర్చాలన్న లక్ష్యం ఇంకా నెరవేరలేదు. అనేకమంది నిరుపేదలు కఠిన దారిద్ర్యాన్ని అనుభవిస్తూనే వున్నారు. పేదరిక నిర్మూలన కోసం అనేక పథకాలు ప్రవేశపెట్టి, రాయితీలు కల్పిస్తున్నప్పటికి అసలైన లబ్దిదారులకు అభివృద్ధి ఫలాలు అందడం లేదు. ఇందుకు రాజకీయ జోక్యమే ప్రధాన కారణంగా చెప్పవచ్చు. ఇందిరక్రాంతి పథంకు అనుబంధంగా జిల్లా స్థాయిలో సంఘరక్ష, మండలస్థాయిలో సంఘమిత్ర, గ్రామస్థాయిలో సంఘబంధాలను ఏర్పాటు చేశారు.

ఇన్ని సంఘాలను ఏర్పాటుచేసి వీటి పనితీరును పర్యవేక్షించేందుకు అవసరమైన సిబ్బందిని నియమించడం జరిగింది. అయినా కూడా కోట్ల రూపాయల నిధులు దుర్వినియోగం కాబడ్డాయి. పొదుపు గ్రూపు మహిళలకు నేరుగా అందించే నగదు ప్రక్కదారి మళ్లింది. వీటిపై ఎన్ని ఫిర్యాదులు అందినా కూడా బాధ్యులపై ఎటువంటి చర్యలు లేవు. ఈ పథకం ప్రారంభించిన తొలిరోజుల్లో ప్రాజెక్టు డైరెక్టర్‌గా వున్న ఐఏఎస్ అధికారి సంపత్‌కుమార్ వారంలో రెండు రోజులు ఏదో ఒక గ్రామంలో రాత్రి వేళలో బస చేసేవారు. దీంతో సిబ్బంది ఆయన బాటలోనే పయనించేవారు.

సిబ్బంది నియామకంలో కూడా ప్రపంచ బ్యాంకు షరతులకు లోబడే చేపట్టేవారు. గ్రామీణ ప్రాంతాలకు చెందిన ప్రజలతో మమేకం అయ్యేవారినే ఎంపిక చేసేవారు. తర్వాత మారిన రాజకీయ పరిణామాల కారణంగా గతంలో నియమింపబడిన సిబ్బందిలో ఎనభైశాతం మంది మానేసి వేరే ఉద్యోగాల్లో చేరిపోయారు. ప్రస్తుతం ఇందిరక్రాంతి పథంలో పనిచేసే సిబ్బంది గ్రామీణ ప్రాంతాల వైపు కన్నెత్తి కూడా చూడడం లేదు. ప్రాజెక్టు డైరెక్టర్ కూడా పేదరిక నిర్మూలనపై ప్రత్యేక దృష్టి సారించడం లేదు. ఒక దఫా రుణాలు పొందిన వారే తిరిగి రుణాలు పొందుతున్నారే తప్ప మిగిలిన వారికి అవకాశం దక్కడం లేదు.

పేదరిక నిర్మూలన పథకాన్ని పొడిగించేందుకు ప్రపంచబ్యాంకు అంగీకరించకపోతే దీని నిర్వహణ ప్రభుత్వానికి కష్టతరంగా మారే అవకాశం వుంటుంది. ఇప్పటివరకు నియమించిన సిబ్బందిని తొలగిస్తారా? ఇతర శాఖలకు బదలీ చేస్తారా అనేది కూడా సందేహంగా మారింది. గతంలో ఐ.కె.పిలో పనిచేస్తున్న సిబ్బందిని రెగ్యులరైజ్ చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. అనంతరం దీని గురించి పట్టించుకోవడం మానేసింది. పథకం గడువు ముగిస్తే ఇందులో పని చేస్తున్న సిబ్బందిని ఇంటికి సాగనంపే అవకాశం వుందని ఐ.కె.పి సిబ్బంది ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

దీని గడువు ఏడాది కాలం వున్నప్పటికి ఇప్పటి నుంచే సిబ్బందిలో ఆందోళన మొదలయ్యింది. కొంతమందికి ఈ పథకం ప్రపంచ బ్యాంకు నిధులతో కొనసాగుతున్న విషయం కూడా తెలియని పరిస్థితి. ఏది ఏమైనా పేదరిక నిర్మూలనపై ప్రభుత్వం ప్రత్యేక పథకాన్ని కొనసాగించాల్సిన అవసరం వుంది.



సృజన సాంస్కృతిక వేదిక నేతృత్వంలో నెల్లూరు స్మార్ట్ క్లినిక్‌లో జరిగిన ఇందిరాగాంధీ వర్థంతి వేడుకల్లో మాట్లాడుతున్న డాక్టర్ సుధాకర్. వేదికపై గూడూరు లక్ష్మి, పర్వీన్ జాని, రామ్మూర్తి, ఆర్వీ శేషయ్యనాయుడు.


ఉత్తమసేవలకుగాను నెల్లూరు రోటరీక్లబ్ ఒకేషనల్ సర్వీసు అవార్డును ఐదవ పట్టణ ఎస్ఐ శ్రీనివాసులురెడ్డికి అందజేస్తున్న క్లబ్ అధ్యక్ష, కార్యదర్శులు రాఘవేంద్ర షెట్టి, కె.మధుసూధనరావు.


ది నెల్లూరు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ 40వ వార్షికోత్సవం సందర్భంగా జరిగిన వేడుకల్లో జ్యోతిని వెల్గిస్తున్న ఆకుల వెంకటేశ్వర్లు. ప్రక్కన సంఘం అధ్యక్ష, కార్యదర్శులు నాగసూరి కామేశ్వరరావు, చలువాది నాగేశ్వరరావు. మాజీ కార్పొరేటర్ రామకృష్ణారెడ్డి.

# మార్కెట్‌లో కల్తీ ఎరువులు!

కల్తీ ఎరువులు రైతులను తీవ్రంగా నష్టపరుస్తున్నాయి. రాళ్ళు, పిండి కలసి వున్న ఎరువులను చూసి రైతులు నోరెళ్లబెడుతున్నారు. ఇటీవల ఇందుకూరుపేట మండలం డేవిస్‌పేట గ్రామానికి చెందిన రైతు అత్తులూరు వెంకటరమణయ్య నాయుడు 20 యూరియా బస్తాలు, 5 బస్తాలు పొటాష్, మరో 5బస్తాలు సూపర్‌ఫాస్ఫేట్ కొనుగోలు చేసి వినియోగించబోగా ఆ బస్తాల్లో మట్టి, బొగ్గు, రాళ్ళు

**జిల్లా కలెక్టర్‌కు ఫిర్యాదు చేసిన డేవిస్‌పేట రైతు**

కన్పించడంతో రైతుకు దిక్కుతోచలేదు. దీంతో కల్తీ ఎరువుల భాగోతంపై వ్యవసాయ అధికారుల దృష్టికి తీసుకొని వచ్చారు. అధికారులు వీటిని కల్తీవేనని నిర్ధారించారు. జిల్లా కలెక్టర్‌ను కలసిన రైతు కల్తీ ఎరువుల విషయాన్ని విన్నవించారు. స్పందించిన కలెక్టర్ ఈ కల్తీ ఎరువులపై విచారణకు ఆదేశించారు. కల్తీ ఎరువులు కృష్ణపట్నం పోర్టు నుండి దిగుమతి చేసుకున్నట్లు రుజువైనా వ్యవసాయాధికారులు విచారణ జరపక వ్యవహారాన్ని నానుస్తుండడం పట్ల పలు అనుమానాలు వ్యక్తమవుతున్నాయి.

# ప్రగతి పథంలో వెంకటగిరి!

**● మునిసిపాలిటీ అయ్యాక పలు అభివృద్ధి పనులు**

మొట్టమొదటిసారిగా మునిసిపాలిటీగా ఏర్పడిన వెంకటగిరి అభివృద్ధి పథంలో పయనించిందనే చెప్పాలి. 2005లో వెంకటగిరిని మూడవ స్థాయి మునిసిపాలిటీగా ప్రభుత్వం ప్రకటించింది. దీన్ని వ్యతిరేకిస్తూ పలువురు ఉద్యమించినా మునిసిపాలిటీగా అవతరించింది వెంకటగిరి. పాలకవర్గం ఛైర్మన్‌గా అల్లం చంద్రమోహన్, ఇతర కౌన్సిలర్లు పట్టణాభివృద్ధికి కోట్ల రూపాయల నిధులు ఖర్చు చేశారు. ప్రజల దాహార్తిని తీర్చేందుకు 70 కోట్ల రూపాయలతో సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకు నిర్మించారు. ఇవన్నీ ఒక ఎత్తయితే పట్టుదలతో మునిసిపాలిటీకి నూతన భవనం ఏర్పరచుకోవడం విశేషం. 70లక్షల రూపాయలు వెచ్చించి నిర్మించిన మునిసిపల్ భవనాన్ని సెప్టెంబర్ 12న నేదురుమల్లి దంపతులు ప్రారంభించడం తెలిసిందే. 6వ వార్డులోని కాలేజిమిట్ట రోడ్డులో పడమర వైపు నిర్మించారు ఈ భవనాన్ని. ఇదే రోడ్డులో తూర్పువైపు సమితి భవనం వుంది. దివంగత పాదిలేటి వెంకటస్వామిరెడ్డి సమితి అధ్యక్షుడుగా వున్నప్పుడు ఈ భవనం ఏర్పాటైంది. కానీ ఈ ఖ్యాతి ఆయనకు దక్కకుండా వుండేందుకు తర్వాత వచ్చిన పాలకవర్గం ఆ భవనాన్ని ఉపయోగించ లేదు. అలాంటిది మునిసిపాలిటీ మాత్రం సొంత భవనాన్ని ఏర్పాటు చేసుకోవడం పట్ల ప్రజలు హర్షం వ్యక్తం చేస్తున్నారు.


కొత్తగా నిర్మించిన వెంకటగిరి మునిసిపల్ కార్యాలయం.

# కలికి సేవలు చిరస్మరణీయం

**విగ్రహానికి నివాళులర్పించిన వంటేరు**

కావలి నియోజకవర్గ అభివృద్ధికి కలికి యానాదిరెడ్డి చేసిన సేవలు శ్లాఘనీయమని మాజీ శాసనసభ్యుడు వంటేరు వేణుగోపాలరెడ్డి కొనియాడారు. ఉదయగిరి బ్రిడ్జి సెంటర్‌లో ఏర్పాటు చేసిన కలికి విగ్రహానికి పూలమాల వేసిన వంటేరు, యానాదిరెడ్డి ప్రజాసేవను నెమరు వేసుకొన్నారు. నా రాజకీయ గురువు యానాదిరెడ్డి, రాజకీయంగా ఎన్నో విలువైన సలహాలు కలికి నుంచి పొందానంటూ తనకు యానాదిరెడ్డితోగల సాన్నిహిత్యాన్ని గుర్తు చేసుకున్నారు. వైఎస్.జగన్ చేతుల మీదుగా కలికి విగ్రహం ఆవిష్కరణ కావడం పట్ల మాట్లాడుతూ ఆ సమయంలో గుజరాత్‌లో వున్నందున కార్యక్రమానికి హాజరు కాలేకపోయానన్నారు. కావలిలో సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు ఏర్పాటుకు కలికి చేసిన కృషికి గుర్తింపుగా ట్యాంకుకు ఆయన పేరు పెట్టాలని సూచించారు. అనంతరం గొట్టిపాటి కొండపనాయుడు, అయ్యపరెడ్డిల విగ్రహాలకు పూలమాలలు వేసి నివాళులర్పించారు. ఈ సందర్భంగా మునిసిపల్ మాజీఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టి వంటేరుకు తేనేటి విందు ఇచ్చారు. గ్రంధిని ఉద్దేశించి వంటేరు ఎప్పుడో ఎమ్మెల్యే కావలసినవాడని వ్యాఖ్యానించడం చర్చకు తెరలేపింది. ఈ కార్యక్రమంలో కేతిరెడ్డి శివకుమార్‌రెడ్డి, నున్నా వెంకట్రావు, జంపాని రాఘవులు, వంటేరు జయచంద్రారెడ్డి, మేదరమెట్ల కృష్ణారెడ్డి, రవికుమార్ చౌదరి పాల్గొన్నారు.

● **కావలిలో**

# పారిశుద్ధ్య పరిస్థితులు ఘోరం!

**మెరుగుపర్చమన్న ఎమ్మెల్యే బీద**

కావలి పట్టణంలో పారిశుద్ధ్యాన్ని మెరుగు పరచేందుకు ప్రత్యేక చర్యలు తీసుకోవాలని శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఆర్డీఓ వెంకటేశ్వర్లును ఆదేశించారు. పట్టణంలో పారిశుద్ధ్యం క్షీణించడం, పలువురు డెంగ్యూ జ్వరాల బారినపడి ప్రాణాలు కోల్పోవడంపై ఆయన అధికారులతో మాట్లాడారు. పందులు తిరగడం, దోమలవ్యాప్తి, పారిశుద్ధ్యం అస్తవ్యస్తంగా వుండడం డెంగ్యూ ప్రబలడానికి కారణాలన్నారు. ఈ వ్యాధి బారినపడిన వారికి ప్లేట్‌లెట్ల కొరత ప్రాణాంతకం అవుతున్నందున ఏరియా ఆస్పత్రిలో వున్న బ్లడ్‌బ్యాంకు, రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంకుల్లో ప్లేట్‌లెట్లు తయారు చేయాలన్నారు. కావలి ప్రభుత్వ ఆస్పత్రిలో ఖాళీగా వున్న వైద్యులు, సిబ్బంది పోస్టుల్ని పూర్తి స్థాయిలో భర్తీ చేసేందుకు కృషి చేస్తానని మస్తాన్‌రావు హామీ ఇచ్చారు. ఈ సందర్భంగా ఆయన ఇటీవల 60మందితో రక్తదాన శిబిరం నిర్వహించిన ఆర్యవైశ్య మిత్రమండలి వారిని అభినందించారు.

# భూఆక్రమణపై విచారణకు డిమాండ్!

**అల్లిమడుగు వివాదంపై సిపిఐ ధర్నా**

బోగోలు మండలంలోని అల్లిమడుగు గ్రామంలో జరిగిన భూ అక్రమాలపై విచారణ జరిపించాలని సిపిఐ డిమాండ్ చేసింది. రైతు సంఘం ఆధ్వర్యంలో కావలి ఆర్‌డిఓ కార్యాలయం వద్ద ధర్నా చేపట్టారు. ఈ సందర్భంగా రైతు సంఘం జిల్లా అధ్యక్షుడు గూడూరు సుబ్బారెడ్డి మాట్లాడుతూ అల్లిమడుగులో 30 ఎకరాల భూమిని ఎస్‌విపాళెం రైతులు 15 ఏళ్లుగా సాగుబడి చేసుకొంటున్నారని తెలిపారు. రెవెన్యూ అధికారులు మాత్రం ఆ భూమిని రికార్డుల్లో చూపకుండా శిస్తులు కట్టించుకోకుండా వ్యవహరిస్తున్నారని ఆరోపించారు. గతంలో బోగోలు ఎమ్మార్వోగా పనిచేసిన ప్రశాంతి కుమారి, విఆర్‌వోలు కుమ్మక్కై ఈ భూముల రికార్డులను తారుమారు చేశారన్నారు. ఈ అవకతవకలపై విచారణ జరిపించాలని డిమాండ్ చేశారు. అలాగే తెల్లపాళెం, మన్నంగి దిన్నెలోగల భూమిని పేద గిరిజనులకు పంచాలని, కొండాపురంలోని ఐదెకరాల ప్రభుత్వ భూమిని పేదలకు ఇవ్వాలని కోరారు. న్యాయం కోసం పోరాటం చేస్తున్న రైతులపై కప్పరాళ్లతిప్ప ఎస్ఐ వీరేంద్ర బాబు చేస్తున్న దౌర్జన్యాలను అరికట్టాలన్నారు.

# ప్రఖ్యాతి గాంచిన నిమ్మ పరిశోధనా కేంద్రం

వెంకటగిరిలోని పెట్లూరు నిమ్మపరిశోధనా కేంద్రం ప్రఖ్యాతి చెందినది. ఈ కేంద్రంలో అధ్యయనం చేసేందుకు కడప జిల్లా రైల్వేకోడూరు ప్రాంతంలోని అనంతరాజుపేట ఉద్యానవన కళాశాల నుంచి విద్యార్థులు వచ్చారు. వీరికి పరిశోధనా కేంద్రం శాస్త్రవేత్తలు గోవిందరాజులు, ముకుందలక్ష్మి, తనూజ, శ్రీనివాస్ తదితరులు నిమ్మసాగులో మెళకువలు, సస్యరక్షణ చర్యల గురించి వివరించారు. సేంద్రియ ఎరువుల వాడకాన్ని గురించి తెలియజేశారు. చుట్టుప్రక్కల గ్రామాలకు వెళ్లి సాగవుతున్న నిమ్మ పంటను ఈ విద్యార్థులు పరిశీలించారు. 1992లో అప్పటి ముఖ్యమంత్రిగా వున్న జనార్ధన్‌రెడ్డి ఈ పరిశోధనా కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. ఆనాటి నుంచి ఇది రైతులకు, పరిశోధనా విద్యార్థులకు, శాస్త్రవేత్తలకు ఎంతగానో ఉపయోగపడుతోంది.

# గూడూరులో భూ మాయాజాలం!

## ● లేని భూమి వున్నట్లు చూపి రుణాలు పొందారు

కాదేది అక్రమాలకు అతీతం అన్నట్లుగా వుంది గూడూరులో పరిస్థితి. పలు భూ కుంభకోణాలు బయటపడిన ఈ ప్రాంతంలో సరికొత్త భూ మాయాజాలం వెలుగు చూసింది. లేని భూమిని ఉన్నట్లు చూపి అధికారుల సంతకాలు ఫోర్జరీ చేసి, నకిలీ పాసుపుస్తకాలు సృష్టించి బ్యాంకుల నుంచి లక్షలరూపాయలు రుణాలుగా పొందిన వైనం బయటపడింది. ఈ మాయాజాలాన్ని ప్రభుత్వం కొత్తగా ప్రవేశపెట్టిన పాసుపుస్తకాలకు యూనిక్ నెంబర్ల నమోదులో ఈ బండారం వెలుగు చూపింది.

పట్టణంలోని పలు వాణిజ్య బ్యాంకుల్లో టైటిల్ డీడ్, పట్టాదారు పాసుపుస్తకాలను రైతులు తనఖా వుంచి రుణాలు పొందివున్నారు. ప్రభుత్వం ఇటీవల ప్రవేశపెట్టిన యూనిక్ నెంబర్ల నమోదులో భాగంగా బ్యాంకుల్లో తనఖాలో వుండి పోయిన పాసు పుస్తకాలకు నెంబర్లు వేసేందుకు అధికారులు వెళ్లి తమ వద్ద వున్న రికార్డులు, పాసు పుస్తకాలలో నమోదు చేసిన వివరాలు తేడా వుండడం గమనించారు. గూడూరు రూరల్ మండలంలోని కాండ్రగ్రామంలో సర్వేనెంబర్ 628లో 0.10సెంట్ల భూమికి బయట 6.10 ఎకరాలుగా నమోదు చేసి 50వేల రూపాయలు రుణం పొందారు. అలాగే ఎమ్మార్వో, ఆర్‌డిఓ సంతకాలు ఫోర్జరీ జరిగినట్లు గుర్తించేలా మండలం లోని కొండాగుంట, కాండ్ర, వెందోడు, కుందకూరు, విందూరు గ్రామాల్లో ఇలాంటి నకిలీ పాసు పుస్తకాల వ్యవహారం బయట పడుతుండడంతో రెవెన్యూ అధికారులు సమగ్ర పరిశీలన జరుపుతున్నారు.



కావలి నియోజకవర్గ పార్టీ నేతలతో కలసి హైదరాబాద్‌లో తెలుగుదేశం సర్వాధినేతను కలిసిన కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు.

## కనుమరుగౌతున్న రొయ్యల సాగు



పరిశ్రమల కోసం ప్రభుత్వం చేపట్టిన భూసేకరణ రొయ్యల సాగుపై ప్రభావం చూపనుంది. చిల్లకూరు మండలంలో ఈ పరిస్థితి ఎదురౌతోంది. రొయ్యల సాగులో చిల్లకూరు మండలం కండలేరు క్రీక్‌కు ప్రత్యేక స్థానం వుంది. దీని క్రింద షుమారు 3వేల హెక్టార్లలో రొయ్యలసాగు చేస్తున్నారు. సముద్రంలోని ఉప్పునీటిని, కాలువల్లోని మంచినీటిని అందించే అవకాశం ఈ

### పరిశ్రమల ఏర్పాటే కారణం

క్రీక్‌కు ఉండడంతో ఈ ప్రాంతంలో అధికంగా రొయ్యల సాగు చేపట్టారు. ఇక్కడ సాగు చేసిన రొయ్యలకు అంతర్జాతీయ మార్కెట్‌లో గిరాకీ వుంది. అయితే మండలంలో భారీ పరిశ్రమలు ఏర్పాటవుతుండడం, పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతుండడంతో రొయ్యల సాగుపై ప్రభావం చూపనున్నాయి. భవిష్యత్తులో రొయ్యలసాగు కనుమరుగై పోతుందని రైతులు ఆందోళన చెందుతున్నారు. ఇప్పటికే పరిశ్రమల ఏర్పాటువలన కండలేరు క్రీక్‌లో మట్టి పేరుకొని పోయింది. అంకులపాటూరు, బెస్తపాళెం, నాంచా రమ్మపేట, తిప్పగుంటపాళెంలో రైతులు రొయ్యలసాగును విరమించుకొన్నారు. భూసేకరణతో తమ పరిస్థితి అగమ్య గోచరంగా మారుతున్నదని రైతులు ఆందోళన చెందుతున్నారు.

## ఉడ్‌హౌస్‌పేట రోడ్డేది?

### వేసి ఏడాదే... కానీ ఆనవాళ్లు లేవు

అధికారులు, కాంట్రాక్టర్ల అవినీతి కారణంగా 84 లక్షల రూపాయలతో నిర్మించిన రోడ్డు ఏడాది కాకముందే ధ్వంసమైంది. అల్లూరు – ఉడ్‌హౌస్‌పేట వరకు నాబార్డు నిధులతో రోడ్డును నిర్మించారు. ఈ వర్క్ పొందిన కాంట్రాక్టర్ సబ్‌కాంట్రాక్టర్‌కు నిర్మాణ పనులు అప్పగించడంతో అంతా అవినీతిమయమైంది. ఎక్కడా నిబంధనలు పాటించకుండా పరమ నాసిరకంగా నిర్మించడంతో రోడ్డు కుంగిపోయింది. పలుచోట్ల గుంటలుపడ్డాయి. ఇంత నాసిరకంగా నిర్మించిన కాంట్రాక్టర్ చేత కనీసం మరమ్మత్తులు చేయించాల్సిన పంచాయితీరాజ్ అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించడంపై చుట్టు ప్రక్కల ప్రాంతాల ప్రజలు మండిపడుతున్నారు.

## ఉపాధి హామీలో ఆగని అక్రమాలు

పేదలకు ఉపాధి కల్పించేందుకు ప్రవేశపెట్టిన ఉపాధి హామీపథకంలో ఎన్నో అక్రమాలు, మరెన్నో అవకతవకలు బట్టబయలవుతుండడం తెలిసిందే. తమ చేతివాటంతో చనిపోయిన వారి పేర్లతో జాబితా తయారు చేసి లక్షలు దిగమింగుతున్న క్షేత్ర సహాయకులు ఇప్పుడు కాంట్రాక్టర్ల అవతారం ఎత్తుతున్నారు. వెంకటాచలం మండలం పూడిపర్తి, ఇడిమేపల్లి, కసుమూరు గ్రామాలలో ఈ అక్రమాలు జరుగుతున్నాయి. పూడిపర్తిలో ఈ పథకం క్రింద రూ.1.50లక్షలు విడుదల కాగా ఫీల్డ్ అసిస్టెంట్లు ఈ పనులను యంత్రాలతో చేయిస్తున్నారు. ఈ మండలాల్లో ఎంపిపిల పర్యవేక్షణ లేకపోవడంతో టెక్నికల్ అసిస్టెంట్లు, ఫీల్డ్ అసిస్టెంట్లు ఏకమై నిధులను దోచుక తింటున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి.

## ధనంపై వ్యామోహంలేని డాక్టర్!

### ● బోగోలులో ఉచిత వైద్యం చేస్తున్న డాక్టర్ వెంకటేశ్వర్లు



ప్రజావైద్యునికి పురస్కారం అందజేస్తున్న కలెక్టర్.

వైద్యో నారాయణో హరి అన్న నానుడిని నిజం చేస్తూ ప్రజల మన్ననలు అందుకొంటున్నాడు బోగోలుకు చెందిన డాక్టర్ వై.వెంకటేశ్వర్లు. బోగోలు పంచాయితీ అక్కరాజు వారి కండ్రిగకు చెందిన వెంకటేశ్వర్లు పేదరికాన్ని అనుభవించి కష్టపడి చదివారు. కర్నూల్ మెడికల్ కళాశాలలో ఎంబిబిఎస్ కోర్సు పూర్తి చేసిన ఆయన ప్రభుత్వ డాక్టర్‌గా పనిచేస్తూ ప్రజలకు సేవ చేస్తున్నాడు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లను అధికసంఖ్యలో నిర్వహించి కలెక్టర్ చేతుల మీదుగా అవార్డు అందుకొన్నాడు. ప్రభుత్వ డాక్టర్‌గా విధులు నిర్వహించడంతోపాటు పేదవారికి ఉచిత వైద్యం చేస్తూ సొంత డబ్బులు ఖర్చు చేసి మందులను కొనిస్తూ పలువురికి ఆదర్శంగా నిలుస్తున్నాడు. బోగోలు మండలంలో ఏ విద్యార్థి అయిన 10వ తరగతి, ఇంటర్మీడియట్‌లో అత్యధిక మార్కులతో పాసైతే కులమతాలకు అతీతంగా వారికి 5వేల రూపాయలను అందిస్తున్నాడు. డాక్టర్లు ధన వ్యామోహంలో పడిపోయిన ఈ రోజుల్లో వెంకటేశ్వర్లు లాంటి డాక్టర్ అరుదు.

## పూజారి రాసలీలలు

### జొన్నవాడలో భక్తులకు రక్షణేది?

పవిత్ర పుణ్యక్షేత్రమైన జొన్నవాడ కామక్షమ్మ దేవస్థానంలో వ్యభిచారం జరగడం సంచలనం కల్గించింది. గత కొంతకాలంగా జొన్నవాడలో అక్రమాలు, అనేక అవకతవకలు జరుగుతున్నాయి. పూజారులు ఇష్టాను సారం ప్రవర్తించడం పలుమార్లు వివాదాస్పదమైంది. పలువురు బినామీ పూజారులు ఇక్కడ విధులు నిర్వహిస్తూ చండాలపు పనులకు పాల్పడుతున్నారు. కూచి చంద్రశేఖర్ అనే పూజారి దేవస్థానంలో వున్న కాశీ అన్నపూర్ణేశ్వరి సన్నిధిలో పని చేస్తున్నాడు. ఈ కామాంధుడు పవిత్రమైన ఆలయంలో వ్యభిచరిస్తూ పట్టుబడడం కలకలం రేపింది. నవరాత్రుల సమయంలో ఈ నీచుడు ఒక మహిళను వెంట తెచ్చుకొని కామాక్షమ్మ సన్నిధి ప్రక్కనే గల అద్దాల మండపంలో ఆ మహిళతో ఒంటిమీద నూలు పోగు లేకుండా కామకేళిలో మునిగి తేలుతుండగా సిబ్బంది పట్టుకొని దేహశుద్ధి చేశారు. గతంలోనూ ఈ కామంధుడు పలువురిపై అత్యాచార యత్నానికి పాల్పడినట్లు గ్రామస్తులు చెప్పున్నారు. అతనికి అద్దాల మండపం తాళాలు ఎవరు ఇచ్చారు? పవిత్రమైన దేవుని సన్నిధిలో వ్యభిచారానికి పాల్పడే ధైర్యం ఎక్కడ నుంచి వచ్చింది? ఇంత జరిగినా పోలీసులు కిక్కురు మనకుండా వుండడంపై పలు అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ఇలాంటి వారి వలన దేవస్థానంలో నిద్రించే భక్తులకు రక్షణ లేకుండా పోయింది. ఆలయంలో అపభ్రంశపు పనులకు పాల్పడుతున్న వారిని కఠినంగా శిక్షించాలని భక్తులు కోరు కొంటున్నారు.

## నిమ్మకాయలకు గిరాకీ!

గూడూరు కేంద్రంగా సాగవుతున్న నిమ్మపంటకు ఈ ఏడాది గిరాకీ ఏర్పడింది. పది సంవత్సరాలపాటు గిట్టుబాటు ధర లేక రైతులు ఇతర పంటలు సాగు చేసుకొంటున్నారు. దీంతో నిమ్మసాగు తగ్గి రాజంపేట, రైల్వేకోడూరు, రాయచోటి, రాజమండ్రి, ఏలూరు, నకిరేకల్

### బస్తా ఆరువేలు

ప్రాంతాల నుంచి నిమ్మకాయలు దిగుమతి చేసుకొంటూ వచ్చారు. ఈ ఏడాది మాత్రం నిమ్మధరలు విపరీతంగా పెరిగాయి. బస్తా ధర 6వేల రూపాయలకు పైగా పలకడంతో తిరిగి రైతులు నిమ్మసాగుపై దృష్టి సారించారు. ప్రస్తుతం 70వేల ఎకరాల్లో నిమ్మ సాగు చేస్తున్నారు.

# నాగదోషాలను పోగొట్టే నాగుల చవితి!



ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాలలో నాగారాధన చేస్తారు. సర్పాలను ఆరాధించడం అనేది భారతదేశంలో అధికం. ప్రకృతిలోని అణువణువును దైవానికి ప్రతిరూపంగా భావించే లక్షణం వుండడం చేత నాగపూజ సంస్కృతిలో భాగమైంది. కార్తీక మాసంలో వచ్చే శుద్ధ చవితి నాడు అనగా దీపావళి పండుగ తర్వాత వచ్చే నాల్గవ రోజున నాగుల చవితిని చేస్తారు. నవంబర్ 9తేది నాగుల చవితి పండుగ.

నాగారాధన ప్రధానంగా జరిగే నాగుల చవితికి ఎంతో ప్రాధాన్యత వుంది. ఆనాడు నాగ పూజ చేసి పుట్టలో పాలుపోసినట్లయితే నాగదోషాలు తొలగి సుఖశాంతులు కల్గుతాయని ప్రగాఢ విశ్వాసం. నాగదోషాల నుంచి విముక్తి పొందేందుకు నాగ పంచమి, సుబ్రహ్మణ్య షష్టి, సుబ్బరాయషష్టి పండుగలు వున్నా నాగుల చవితి పండుగకు విశేషం వుంది. చవితి నాడు పొద్దుటే తలంటుపోసుకొని దీపారాధన చేసి పుట్ట వద్దకు వెళ్లి ప్రదక్షిణలు చేసి పాలు పోయాలి. పండ్లు, వడపప్పు, చలిమిడి నైవేద్యంగా పెడతారు. పగలంతా ఉపవాసం వుండి రాత్రికి భోజనం చేయడం ద్వారా దోషాలు తొలగడం, చెవి, కంటి వ్యాధులు తొలగుతాయని ముఖ్యంగా సంతాన ప్రాప్తి కల్గుతుందని పురాణాలు చెప్తున్నాయి. నాగుల చవితి సాధారణ పండుగే కాక జ్యోతిష, యోగశాస్త్రాల పరంగాను ప్రాముఖ్యతగలదని పురాణ కథనం. నాగుపాము శైవ వైష్ణవ బేధాలకు అతీతంగా శివుడి మెడలో అలంకారంగాను, అటు విష్ణువుకు పాన్పుగాను వుండడం విశేషం. రామాయణం, భారతం, భాగవతాలలో సర్పాల ప్రస్తావన వుంది.

పాతాళం నాగుల జన్మస్థలమైనా ప్రకృతిలో అధికంగా సంచరిస్తూ వుంటాయి. జ్యోతిషపరంగా జ్యేష్ఠ నక్షత్రం నాలుగు పాదాలు వృశ్చికరాశిలో వుంటాయి. ఈ రాశిలోకి సూర్యుడు ప్రవేశించినపుడు నాగుల చవితిగా జరుపుకోవడం ఆనవాయితి. ఇక యోగ శాస్త్రంపరంగా శరీరంలో కుడి ఎడమల వుండే పింగళ, ఇడ నాడులను ఆడామగ సర్పాలతో పోలుస్తారు.

వాసుకి, తక్షకుడు, ఐరావతుడు, ధనుంజయుడు, కర్కోటకుడు, శంఖపాలుడు, అనంతుడు, శేషుడు అను 8 మంది సర్పజాతికి మూల పురుషులు. వీరిలో వాసుకి, అనంతుడు, శేషుడు సత్వగుణాన్ని, ఐరావతుడు, ధనుంజయుడు, శంఖపాలుడు రాజో గుణాన్ని, తక్షకుడు, కర్కోటకుడు తమో గుణాన్ని కల్గి వుంటారు. త్రాచుపాములు తక్షక వంశానికి, నల్లత్రాచులు కర్కోటక వంశానికి చెందినవని, బంగారు వర్ణంలో వుండే సర్పాలు అనంతుడు వంశానికి, తెలుపు రంగులో వుండే పాములు శేష, శంఖపాలుడు వంశానికి చెందినవని, పసుపు రంగులో వుండే సర్పాలు ధనుంజయ వంశానికి, బూడిద రంగులో వుండే పాములు ఐరావతుడి వంశానికి చెందినవిగా పురాణాలు చెప్తున్నాయి. వీటిలో కొన్ని సర్పాల పడగలపై మహిమాన్వితమైన, అమూల్యమైన మణులు వుంటాయి. నాగులను అనాలోచితంగా చంపినా, బాధించినా నాగ దోషం సంక్రమిస్తుంది కాబట్టి ఆ దోషాలను పోగొట్టుకొనేందుకు నాగుల చవితినాడు నాగ పూజ చేసి ఉపవాసం వుంటారు.

## ట్రంకు రోడ్డు

### ఓదార్పుకు ముందు... వెనుక విగ్రహాలు



జగన్ ఓదార్పు యాత్ర జిల్లాలో అప్రతిహతంగా కొనసాగుతోంది. వందల సంఖ్యలో దివంగత వైఎస్.రాజశేఖర్‌రెడ్డి విగ్రహాలను ఆవిష్కరిస్తున్నాడాయన. ఈ యాత్రను పురస్కరించుకొని వైఎస్ విగ్రహాలను తయారుచేసుకొని తూర్పు గోదావరి జిల్లా నుంచి నెల్లూరుకు వచ్చిన శిల్పుల బృందం జగన్ రూట్ మ్యాప్ ప్రకారం ఆయా గ్రామాలకు మొబైల్ వాహనాల్లో వైఎస్ విగ్రహాలు ముందు తీసుకెళ్లి ప్రదర్శనకు పెట్టి అమ్ముతున్నారు. జగన్ కాన్వాయ్‌లోనూ వైఎస్ విగ్రహాలు వుండడం చర్చనీయాంశమయ్యింది.

### కామ్రేడ్లపై విరిగిన లాఠీ



నెల్లూరులో ఏ పార్టీ వారిపై లాఠీఛార్జి చేయాలన్నా ముందు వెనుక ఆలోచించని పోలీసులు మార్క్సిస్టుల జోలికి వెళ్లను మాత్రం జంకేవారు. అటువంటిది ఈ మధ్య వారిని చెడుగుడు ఆడేస్తున్నారు. పేదలకు ఇళ్ల స్థలాలు, ఇందిరమ్మ ఇళ్లు మంజూరు చేయాలని గాంధీబొమ్మ వద్ద ఐదు రోజులుగా ధర్నా చేస్తున్న కామ్రేడ్స్‌ను తెల్లవారుజామున అరెస్ట్ చేశారు. దీన్ని నిరసిస్తూ కలెక్టరేట్ వద్ద ధర్నాకు దిగిన వారిపై లాఠీలతో పైశాచికంగా విరుచుకపడ్డారు. ఫైబర్ లాఠీలు చేతబట్టి వన్‌టౌన్, ఫిఫ్త్‌టౌన్ ఎస్‌ఐలు రెచ్చిపోవడంతో వెనుకనున్న పోలీసులు మహిళా కామ్రేడ్లని చూడక చావచితక కొట్టారు. పోలీసులకు మార్క్సిస్టులు సడన్‌గా ఎందుకు బలహీనులనిపిస్తున్నారో ఏమో... వారే ఆత్మవిమర్శ చేసుకోక తప్పదు.

### కలెక్టర్ కాదు కీలుబొమ్మ



జిల్లా కలెక్టర్ రామ్‌గోపాల్ వివాదాల్లో తలదూర్చే వ్యక్తి కాకపోవడం వల్ల ఆయన్ను విమర్శించే వాళ్లు తక్కువ. కాని ఆయన రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఒత్తిడికి తలవొగ్గి గాంధీబొమ్మ వద్ద నగరంలోని వివిధ సమస్యలు పరిష్కరించాలని సిపిఎం చేస్తుండిన ఆమరణ రిలే నిరాహార దీక్షల శిబిరాన్ని ఎత్తించి వేయడంతో ఆ పార్టీ నాయకులు ఆయనపై నిప్పులు కురిపించారు. సిపిఎం నగర నేత మోహన్‌రావు అయితే ఆయన్ను కలెక్టర్ కాదు కీలుబొమ్మ అన్నారు. ప్రజల బాగోగులు చూడాల్సిన కలెక్టర్ ఆనం సోదరుల చేతిలో కీలుబొమ్మగా మారారు. వారు చెప్పినట్లు తలాడిస్తున్నాడు. దీనివల్లే నగరంలో రాక్షసపాలన నడుస్తోంది. వివేకానందరెడ్డి మాటవిని కల్లూరుపల్లిలో 400 మంది పేదల ఇళ్లు, ఎసి మార్కెట్ వద్ద బుట్టల్లో కూరగాయలు అమ్ముకొనే 300 మందిని అక్కడ నుంచి తొలగించారని ఇది మంచిది కాదని మార్క్సిస్టులు శాపనార్థాలు పెట్టడం ట్రంకు రోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### అపచారం...



జొన్నవాడ కామాక్షమ్మ దేవస్థానంలో ఆగమ నియమాలు, పూజలు పునస్కారాలు సక్రమంగా అమలు కావడం లేదు. కంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతినే ఇక్కడ జరుగుతున్న పూజా విధానాన్ని మార్చమని సలహా యిచ్చినా మారలేదు. వైఎస్.జగన్ ఓదార్పు యాత్రను పురస్కరించుకొని వేళకానివేళ జొన్నవాడ కామాక్షమ్మ ఆలయాన్ని కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తెరిపించడం వివాదాస్పదమయ్యింది. ఆగమశాస్త్ర నియమం ప్రకారం మధ్యాహ్నం ఒంటి గంటకు మూసే దేవాలయం సాయంత్రం ఐదు గంటలకు తెరుస్తారు. జగన్ జొన్నవాడ రాకను పురస్కరించుకొని వేళకాని వేళ మధ్యాహ్నం మూడున్నరకు దేవాలయం తలుపులు తీయించి పూజలు చేయించాడు ప్రసన్న. పూజారులు వలదన్నా మాట వినలేదాయన.

### నవ్విపోదురు... మాకేమి?



ఎపిఎస్ ఆర్టీసి మేనేజింగ్ డైరక్టర్ జి.ప్రసాదరావు ఈ వారంలో నెల్లూరు వచ్చారు. వచ్చినకాడికి తనిఖీలు చేయాలి కదా? మెయిన్ బస్టాండ్ తోపాటు డిపోలో నాలుగడుగులు నడిచారు. నెల్లూరు ఆర్టీసి బస్టాండ్, దాని పరిసరాలు ఎలా వుంటాయో నెల్లూరీయులకు తెలియంది కాదు. కాని ప్రసాదరావు మాత్రం నవ్విపోదురు... మాకేమిటి తరహాలో ఆర్టీసి డిపో, బస్టాండ్ బ్రహ్మాండమని ప్రశంసించారు. పై తిరుగుళ్లతో ఎమ్డీనే ఈ విధంగా ప్రకటిస్తే ఇక ఆర్టీసి అధికారులను పట్టగలమా? ప్రజలకు వారు కనీస సౌకర్యాలైనా కల్పిస్తారా?

## రాజకీయ గోదాములు




వ్యవసాయ ఉత్పత్తుల్ని నిల్వ వుంచడానికి రాష్ట్రంలో ఆరు లక్షల మెట్రిక్ టన్నుల నిల్వ సామర్థ్యం వుండే గోదాముల్ని నిర్మించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇందులో మూడు లక్షల మెట్రిక్ టన్నుల సామర్థ్యం గల గోదాముల్ని రాష్ట్ర మార్కెటింగ్ శాఖ, మిగతా సామర్థ్యం గోదాముల్ని రాష్ట్ర గిడ్డంగుల సంస్థ ప్రయివేటు భాగస్వామ్యంతో నిర్మిస్తున్నారు. ఇలా నిర్మించిన గోదాముల్ని ఎఫ్‌సిఐ సంస్థ ఏడాది నుంచి ఏడేళ్లపాటు అద్దెకు తీసుకుంటుంది. లాభసాటిగా వుండే ఈ గోదాముల నిర్మాణానికి ప్రయివేటు వ్యక్తుల నుంచి పెద్ద డిమాండ్ వుంది. అయితే ఎమ్మెల్యేలు, ఎమ్పీలు, రాష్ట్ర మంత్రులు రంగంలోకి దిగి బినామీ పేర్లతో తమ తాబేదార్లకు ఈ గోదాముల్ని కట్టబెడుతున్నారు. దీంతో అధికార వర్గాలు ఈ గోదాములను 'రాజకీయ గోదాము'లంటూ ముద్దుగా పిలుచుకుంటున్నారు.

## దొడ్డిదారిన అయ్యవార్ల బదలీలు




పిల్లలకు పాఠాలు చెప్పే అయ్యవార్ల బదలీలు దొడ్డిదారిన జరుగుతున్నాయి. రాష్ట్రవ్యాప్తంగా కొత్త అయ్యవార్ల నియామకాలు ఒక పక్కన జరుగుతుండగానే గుట్టుచప్పుడు కాకుండా ప్రభుత్వం తమకు కావాల్సిన వారి బదలీలను చేసేస్తోంది. దీనివల్ల మంచి పోస్టింగ్‌లన్నీ దొడ్డిదారినే జరిగిపోతున్నాయి. ఈ బదలీలకు సిఎం పేషీ కేంద్రస్థానంగా మారింది. ఎమ్మెల్సీ సిఫార్సు ఉత్తరం తెచ్చుకుంటే సంబంధిత మంత్రి సిఫార్సు చేయడం, అదికాస్త ముఖ్యమంత్రి ఆమోదముద్ర పడటం, కావాల్సిన బదిలీ చకచకా జరిగి పోవడం మామూలై పోయింది. గత రెండు నెలల్లో ఇలాంటి అక్రమ బదలీల సంఖ్య వేలల్లోనే వుందట. పిల్లలకు మంచి చెడు వివరించి చెప్పాల్సిన అయ్యవార్లే ఈ రకంగా అక్రమ బదలీలు చేయించుకోవడంలో విజ్ఞత వారికే తెలియాలి.

## బాబు నోట మళ్లీ నగదు పథకం

నగదు బదలీ పథకంతో గత ఎన్నికల్లో జాక్‌పాట్ కొట్టేయాలన్న చంద్రబాబు పథకం బెడిసి కొట్టినా బాబుకు మాత్రం దానిపై మోజు తీరలేదు. సూక్ష్మ రుణాలపై ప్రజల్లో చైతన్యం కలిగించడానికి మంగళవారం నుంచి బాబు రంగారెడ్డి జిల్లా నుంచి పర్యటన ప్రారంభించాడు. ఈ పర్యటనలో పలుచోట్ల బాబు నగదు బదలీ పథకం అమలు గూర్చి పదే పదే ప్రస్తావించాడు. సోమవారం రోజున ఉత్తరప్రదేశ్‌లో ముఖ్యమంత్రి మాయావతి ఈ నగదు బదలీ పథకాన్ని ప్రవేశ పెట్టారు. బహుశా బాబు కూడా మాయావతిని స్ఫూర్తిగా తీసుకొని మళ్లీ నగదు పథకం గురించి చిలక పలుకులు పలుకుతున్నాడు. దీన్నిబట్టి చూస్తే వచ్చే ఎన్నికల్లో కూడా తెలుగుదేశం పార్టీకి నగదు పథకమే తురుపుముక్క కానున్నదన్న మాట. చూద్దాం... ఈసారైనా బాబుకు కలిసొస్తుందేమో?

## మంత్రి పేషీకి కెమెరాల 'చెక్'



మైనార్టీ శాఖ మంత్రి అహ్మదుల్లాకు తన సొంత పేషీపైనే నమ్మకం పోయినట్లుంది. తనకు తెలీకుండా పేషీలోని ఆంతరంగిక సిబ్బంది పనులు చక్కబెడుతున్నారని మంత్రి అనుమానిస్తున్నాడు. తను ఛాంబర్‌లో వుంటే పేషీలోనే 'అంతా జరిగిపోతుందన్నది' మంత్రి భావన. అందుకే తన ఛాంబర్‌కు ఎవరెవరు వస్తున్నారు? వచ్చిన వాళ్లు ఎవర్ని కలుస్తున్నారు? ఏం మాట్లాడుకుంటున్నారు? అన్న విషయాల్ని ఆరా తీయడానికి పేషీ చుట్టూ, పేషీ లోపల సిసి కెమెరాల్ని ఏర్పాటు చేయించాడు. ఈ కెమెరాల ఖర్చు ప్రభుత్వ ఖాతాలో రాయడానికి వీలులేదు. అయినా సొంత డబ్బులు ఖర్చుపెట్టి మరీ కెమెరాల్ని పెట్టించాడు. తన టేబుల్ పైన మానిటర్ పెట్టుకొని పేషీలో ఏం జరుగుతున్నదీ గమనిస్తున్నాడట. అయినా మంత్రి అమాయకత్వం కానీ పైరవీలు చేసేవారు పేషీకే రావాలా! ఏం? పాపం మైనార్టీ మంత్రి!!

# వారఫలాలు

తేది 6-11-2010 నుండి 12-11-2010 వరకు తులలో రవి, శుక్రులు; కన్యలో శని; కుంభంలో గురువు; వృశ్చికంలో బుధ, కుజులు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; తుల, వృశ్చిక, ధనుర్మకరాల్లో చంద్రుడు సంచరిస్తారు.




సుఖసంతోషాలకు కొదవుండదు. బంధువుల నడుమ ప్రతిష్ఠ పెరిగే రీతిలో సాహసకృత్యాలు చేస్తారు. జ్యేష్ఠ సోదరుల, మిత్రుల సాయమందుతుంది. వృత్తిలో పురోగతి ఉంటుంది. ముఖ్యులైన మిత్రుల్ని కలుసుకొంటారు. అవసరమైన గృహోపకరణాలు కొంటారు. ధనాదాయం తృప్తినిస్తుంది. దైవపూజాదుల్లో అత్యధిక శ్రద్ధ చూపుతారు. మాతృసంబంధీకుల నుండి కోరిన సాయమందుతుంది.




సన్నిహితుల, మిత్రుల ద్వారా ప్రియవార్తా శ్రవణం. విశిష్ఠ వస్త్రాభరణ ప్రాప్తి. బంధుమిత్రుల కారణంగా శుభవ్యయాలుంటాయి. పూజాదులు బృందకార్యక్రమాలు విజయవంతంగా సాగుతాయి. శుభకార్యాలకు వెచ్చిస్తారు. మూర్ఖపు పట్టుదల పనికిరాదు. దైవపూజ కార్యక్రమాలలో పాలుపంచుకొంటారు. బంధుమిత్రుల మూలంగా కష్టనష్టాలెక్కువ. ప్రయాణాలలో జాగ్రత్త.




ఇతరుల విషయాలలో జోక్యం చేసుకోవద్దు. అనారోగ్య బాధ లుండవచ్చు. ఖర్చులు మితిమీరడం బాధాకరంగా ఉంటుంది. భగవత్ప్రార్థన మేలు. ఎదురుచూసిన వ్యక్తుల్ని కలుసుకొంటారు. వ్రత నియమాలవైపు మనసు పోనిస్తారు. ప్రయాణాలు లాభిస్తాయి. దాన ధర్మాది పనుల్లో మనసు పోనిస్తారు. శుభ వినోదకార్యాల్లో భాగం పంచుకొంటారు. వృత్తి విషయాలు చక్కగా ఉంటాయి.




బంధుమిత్రులను, గురుతుల్యులను కలుసుకొంటారు. శుభ కార్యాలలో మీ పాత్ర చక్కగా నిర్వహిస్తారు. మాతృసంబంధీకుల నుండి కోరిన సాయమందుతుంది. వాహన యోగావకాశాలు బాగున్నాయి. భవిష్యదాదాయాలను ఊహించి ఖర్చు చేస్తారు. అభిప్రాయ భేదాలు తొలగి కళత్ర సంబంధాలు మెరుగుపడతాయి. సదాలోచనలు మంచిది. కుటుంబసభ్యుల అవసరాలను పూర్తి చేస్తారు.




సోదరుల మూలంగా ధననష్టం. దగ్గరి ప్రయాణావకాశాలు. సాహసాలు పనికి రావు. బదిలీలు, స్థలం మార్పులకు సంబంధించిన ప్రయత్నాలు చేస్తారు. పట్టుదలతో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. శారీరక, మానసిక శ్రమ, ఆస్వస్థత దర్శనం ఉంటుంది. సోదరుల మూలంగా ఇబ్బందులుండవచ్చు. ధనవిషయంలో కూడా కటకట ఉండవచ్చు. ఖర్చులధికం. పనులు నిదానంగా సాగవచ్చు.




ఆదాయంలో మిశ్రమ ఫలితాలుంటాయి. స్పెక్యులేషన్ జోలికి పోరాదు. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. పాత బాకీలు వసూలు కావడం కష్టం. తీవ్రమైన అనారోగ్య సమస్యలు లేకపోయినా గ్యాస్ట్రిక్ సమస్యలు, నరాలకు సంబంధించిన సమస్యలుంటాయి. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. కొనుగోలుదారుల నాడి తెలుసుకొని వ్యాపారులు మంచి లాభాలను ఆర్జిస్తారు.

## పంచాంగం

7తేది కేదార గౌరీవ్రతం. కార్తీక స్నానాలు.
9తేది నాగుల చవితి.
10తేది నాగపంచమి.

### శుభ ముహూర్తాలు

11, 12తేదీల్లో చిన్న విషయాలకు రా.10.00 నుండి 11.00 గంటల వరకు కర్కాటకలగ్నాన

12తేదీ వివాహ, గృహారంభాలకు రా.1.00 నుండి 2.00 గంటల వరకు సింహలగ్నాన శుభ ముహూర్తాలున్నాయి.

### నవంబర్ తిథులు

కార్తీక శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 6 | శని | అమావాస్య | ఉ.10.17 | గం.ల.వ |
| 7 | ఆది | శు.పాడ్యమి | ఉ.8.03 | గం.ల.వ |
| 8 | సోమ | విదియ | ఉ.6.22 | గం.ల.వ |
| | | తదియ | తె.5.22 | గం.ల.వ |
| 9 | మంగళ | చవితి | తె.5.09 | గం.ల.వ |
| 10 | బుధ | పంచమి | తె.5.43 | గం.ల.వ |
| 11 | గురు | షష్ఠి | పూర్తిగా | |
| 12 | శుక్ర | షష్ఠి | ఉ.7.01 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




సామూహిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమాజంలో పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయి. వృత్తి, ఉద్యోగ స్థానాల్లో మంచిపేరు లభిస్తుంది. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. ఇరుగుపొరుగువారి సహకారం అందుతుంది. నూతన ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. చాలా కాలంగా వాయిదా పడుతున్న పనులను పట్టుదలతో పూర్తి చేస్తారు.




గౌరవనీయుల సమాగమం ఆశించిన ఫలితాల్నివ్వకపోవచ్చు. వృత్తి వ్యాపారాల్లో ఊహించిన ప్రయోజనాలు సాధించడం కష్టసాధ్యం. సమావేశాల్లో అధికారుల నుండి ప్రతికూలత ఎదురవుతుంది. ఇతరుల విషయాల్లో జోక్యం వద్దు. తల్లి ఆరోగ్యం చక్కగా ఉంటుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఒక మోస్తరుగా ఊపందుకొంటాయి. గృహసంబంధమైన వస్తువులు కొంటారు.




వృత్తిలో గౌరవ మర్యాదలు ఇనుమడిస్తాయి. భూ సంబంధిత ప్రశ్నలు, సమస్యలు ఒక కొలిక్కి వస్తాయి. చిరకాలంగా ఎదురుచూసిన వేతనాదుల గురించి శుభవార్త వింటారు. కళత్రసంబంధాలు కొంత మెరుగు. సంతానం మూలంగా సుఖశాంతులు. ఇష్టులైన వారితో కాలక్షేపం బాగా సాగుతుంది. పిల్లల విద్యావిషయాల్లో శుభపరిణామాలు చోటు చేసుకొంటాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి.




ప్రయాణాలలో విఘ్నాలుంటాయి. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా లాభప్రాప్తి ఉంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖత వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. వ్యాపారుల లావాదేవీలు సక్రమంగా ఉండవు. సోదరుల మూలంగా శ్రమ. అన్ని రంగాల్లో వివిధ మార్పులుంటాయి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉంటాయి.




సంఘంలో గౌరవ మర్యాదలు పెరుగుతాయి. వృత్తి, ఉద్యోగాలలో ఎదురుచూసిన లాభాలనందుకొంటారు. విందులు వినోదాలలో పాల్గొంటారు. దూరదేశ ప్రయాణావకాశాల సూచన. మిత్రుల మూలంగా శుభవార్తాశ్రవణం. వివాహాది శుభకార్యాలకు ప్రేరేపణ జరుగుతుంది. నూతన మిత్రుల పరిచయం లభిస్తుంది. గృహ పరిసరాలను శుభ్రపరచి, గృహాలంకరణపై ఆసక్తి చూపుతారు.




అలసట, చిరాకు, పనుల్లో ఆటంకాలుంటాయి. కుటుంబసభ్యులతో మృదువైన పలకరింపులు ఉండాలి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం. రుణమూలకంగా ధనప్రాప్తి. కళత్ర సంబంధీకుల నుండి శుభవార్తాశ్రవణం. ధనాదాయం తృప్తికరంగా ఉంటుంది. ఆత్మవిశ్వాసంతో అన్ని పనులు నిరాటంకంగా సాగించుకొంటారు. దూరప్రాంతాల్లో ఉన్న ఇష్టులను కలుసుకొంటారు.

# మెట్ల క్రింద నీటి సెల్లార్ పెట్ట కూడదు!

వై.తిరుపతి — విజయవాడ

* మెట్ల క్రింద 'నీటి సెల్లార్' పెట్టవచ్చా?

శ్వాసకోశ సంబంధిత వ్యాధులొస్తాయి. అలా చేయకండి. పైగా యజమానికి ప్రాణహాని.

పైడిమాల అర్జునరెడ్డి — కడప

* 'శని' శత్రుస్థానం, దోషపు గడిలోకి వస్తే శాస్త్రాలేం చెబుతున్నాయి.

అరిష్టాలు, కష్టాలు ఒక్కసారిగా దాడిచేస్తాయి. రోగం, విషాదం, మృత్యువు, వివాదం, కలహం ఆకస్మికమవుతాయి. కీళ్ల రుగ్మత, కళత్ర వివాదం, వియోగం సంప్రాప్తమౌతుంది.

పి.అనసూయాదేవి — నాయుడుపేట

* కుండ మార్పిడి పెళ్లిళ్లు చేసుకున్నాక మా అమ్మాయి కాలు పెట్టాక వ్యాపారంలో నష్టం వచ్చిందట.

వాళ్లు పనికిమాలిన వాళ్లయితే అలా అన్నారు. వాళ్లమ్మాయి మీ ఇంట్లో వుందని మీరూ అలా అంటారా? అప్పుడు వాళ్లకీ మీకూ తేడా ఏముంటుంది? పెద్ద మనుషుల మధ్యస్థం పెట్టించండి.

పడవలవారి ధనలక్ష్మి — ముత్తుకూరు

* మా అమ్మాయిని భర్త తిరిగి తీసుక వెళతాడా? రెండో అమ్మాయికి పెళ్లవుతుందా?

మీ ఉత్తరం చదవాక మహిళా పోలీస్ స్టేషన్‌లో పెద్దమ్మాయి విషయంలో ఫిర్యాదు చేయడం మంచిదనిపిస్తుంది. రెండో అమ్మాయికి 2011 ఆగష్టులో వివాహమవుతుంది.

పి.కోదండరామయ్య — సూళ్లూరుపేట

* నా పేరు కోదండరామయ్య, పుట్టిన తేది లేదు. ఏ గణం వస్తుంది?

మీది దేవగణం, జంతువు పిల్లి వస్తుంది. అమ్మాయితో మీ జీవితం బాగుంటుంది. వివాహం కుదుర్చుకోండి.

షేక్ మూర్తజాబేగం — నెల్లూరు

* ఆగ్నేయంలో సెప్టిక్ ట్యాంకు వుంది. పెద్దమ్మాయి పెళ్లికి దీనికి సంబంధం వుందా?

ఆగ్నేయ దోషాలు స్త్రీలను పీడిస్తాయి. ప్లాటు ఖాళీ చేయండి. మీరు ఉత్తర, పశ్చిమ గృహాల్లో మాత్రమే చేరండి.

పి.ఉమాకాంతం — ఆత్మకూరు

* 'సాత్విక పూజ' అన్నారు. అది ఎట్లా చేయాలి?

గృహంలో శంఖుస్థాపన, ద్వార ప్రతిష్ఠ, శ్లాబు, గృహారంభం వంటి కార్యక్రమాల్లో టెంకాయ, నిమ్మకాయ, గుమ్మడి వంటి శాకాహార వస్తువులతో కూడిన పూజావిధానం 'సాత్విక పూజ'.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

ఎస్.కేతన్‌రెడ్డి — బెంగుళూరు

* ఈశ కొలను క్రింది స్థలం ఎక్కడ రావాలి?

తూర్పు, ఉత్తరాల కొలతల్లో సగభాగంలోపు గానీ అటు, ఇటు మూడు అడుగులు వదలిన ఈశాన్య స్థలంలోగానీ రావచ్చు.

మునుగోడు ఆశీర్వాదం — తడ

* ఉద్యోగంలో చేరాను. వైఢూర్యం అంత శక్తివంతమైనదా?

నవరత్నాలు, అష్టద్వాదశ యంత్రాలు, భారతీయ శాస్త్రాలు చాలా గొప్పవి. నమ్మితే నమ్మకాన్ని వమ్ము చేయవు. భగవంతుడికి కృతజ్ఞతలు తెలపండి.

ఆర్వేల అరవిందశర్మ — నెల్లూరు

* అపార్టుమెంటు తూర్పు ఈశాన్యం వైపు ఉంది. పెరిగిన వాయువ్య స్థలంలో కూడా ప్లాటు కట్టారు.

వ్యాపారస్థులకి లాభార్జనే కావాలి. ఈశాన్యం కోణవేధ, వాయువ్యం భ్రష్టత వున్నాయి. మీరు ప్లాటు కొనక పోవడమే మంచిది.

బైలం జానకమ్మ — సూళ్లూరుపేట

* ఎదురు రెండిళ్లు మా యింటిపై తిరిగి వున్నాయి. ఎప్పుడూ చిడిముడిగా వుంటుంది.

ఇది లేఅవుట్ లోపం. ఇలాంటి చోట స్థలాలు కొనడం నష్టం. మీ యింటికి రెండిళ్లు కోణవేధను కలిగిస్తున్నాయి. వాస్తు యంత్రం ప్రతిష్టించుకోండి.

# అటవీశాఖ పనితీరు ఘోరం!

**జిల్లాలో అటు సామాజిక అటవీ వన విభాగం గానీ, అటవీశాఖలు గానీ అసలు పని చేయడంలేదు. వనీకరణకు విడుదలవుతున్న కోట్లాదిరూపాయల నిధులు మాత్రం వుట్రవుడియంగా స్వాహా చేసేస్తున్నారు.**



జిల్లా అటవీశాఖాధికారి కార్యాలయం.

ప్రజల భాగస్వామ్యంతో అభివృద్ధి పరచబడిన అటవీ యాజమాన్యం ద్వారా పేదరిక నిర్మూలన చేయాలన్న వుద్దేశంతో ఆంధ్రప్రదేశ్ సాముదాయక అటవీ యాజమాన్యం పథకం ప్రవేశపెట్టబడింది. ఈ పథకం క్రింద అటవీ సంపద కలప, కలపేతర అవసరాలను తీర్చే బాధ్యతను సామాజిక వన విభాగానికి అప్పగించింది ప్రభుత్వం. గుర్తింపు పొందిన 46 వనసంరక్షణ సమితులు సమీప ప్రదేశాలలో మొక్కలు నాటాల్సి వుంటుంది. ఇందుకు ప్రతి సంవత్సరం కోట్ల రూపాయల నిధులు ఖర్చు చేస్తున్నా ఆశించిన ఫలితాలు మాత్రం రావడం లేదు. అటవీశాఖ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన నర్సరీల నుంచి తక్కువ ధరకు మొక్కలు కొనుగోలు చేయాల్సి వుంటుంది.

నర్సరీల ద్వారా మొక్కలను విక్రయించడం ద్వారా వచ్చే నగదు విషయంలో సిబ్బంది అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారన్న ఆరోపణలు వున్నాయి. అటవీశాఖను రెండు విభాగాలుగా విభజించారు. సామాజిక అటవీ వనవిభాగం, అటవీశాఖలు వున్నాయి. సామాజిక వన విభాగం ఆధ్వర్యంలో నర్సరీలలో మొక్కలు పెంచడం, చెరువు తోటల పెంపకం తదితర కార్యక్రమాలు చేపడుతుంటారు. వన సంరక్షణ సమితులను ఏర్పాటుచేసి వీటి ఆధ్వర్యంలో గ్రామీణ ప్రాంతాలలో ప్రజలకు కూలీ పనులు కల్పించాలన్నది వన సంరక్షణ సమితుల ముఖ్య సంకల్పం. అయితే వనసంరక్షణ సమితులు సక్రమంగా పని చేయకపోయినా సంబంధితశాఖ అధికారులు చూసీచూడనట్లుగా వుంటున్నారు.

సంపూర్ణ గ్రామీణ ఉపాధి పథకం క్రింద సంవత్సరానికి 2లక్షల నుంచి 3లక్షల పండ్ల మొక్కలు విక్రయించడం జరుగుతుంది. ఈ నిధులను కూడా ప్రక్కదారి మళ్లించి కాకి లెక్కలు చూపుతుంటారు. ఉన్నతాధికారుల పర్యవేక్షణ లోపించడంతో క్రిందిస్థాయి అధికారులు, సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు.

## అడవుల పరిస్థితి

జాతీయ అటవీ విధానం ప్రకారం భూభాగంలో 33శాతం అటవీ ప్రాంతంగా వుండాలి. ప్రస్తుతం మన జిల్లాలో 20శాతం మాత్రమే అటవీప్రాంతంగా వున్నట్లు రికార్డులు చెబుతున్నాయి. మరో 13శాతం ప్రాంతాన్ని అడవుల క్రిందకు తీసుకురావాలన్నది అటవీశాఖ వుద్దేశం. ఇందులో భాగంగా అనేక అటవీ పథకాలను చేపట్టి తరిగిపోయిన అటవీ ప్రాంతాన్ని పునరుద్ధరణ చేసి వృధాగా వున్న బంజరు భూమిలో చెట్లను నాటాల్సి వుంటుంది.

నెల్లూరు అటవీ డివిజన్ పరిధిని ఆరు రేంజ్‌లుగా విభజించారు. కావలి, నెల్లూరు, ఆత్మకూరు, ఉదయగిరి, రాపూరు, వెంకటగిరి ప్రాంతాలలో కార్యాలయాలను ఏర్పాటు చేశారు. అటవీ ప్రాంతంలో ఎనిమిది శాతం దట్టమైన అడవులు, 23 శాతం బైలు అడవులు, 31శాతం చిట్టడవులు, 18 శాతం విడి అడవులు, 14 శాతం ఖాళీ ప్రాంతాలుగా గుర్తించడం జరిగింది. ఈ సంవత్సరం విడి, చిట్టడవులను అభివృద్ధి చేస్తున్నారు. మిగిలిన వాటి గురించి పట్టించుకోవడం లేదు. 2008 – 09 సంవత్సరం నుంచి వీటి అభివృద్ధికి శ్రీకారం చుట్టిన అధికార్లు రెండు సంవత్సరాలు పూర్తయినా కూడా పూర్తి చేయలేకపోతున్నారు. మరో ప్రక్క అధికారుల మధ్య సమన్వయం కొరవడింది. ఒక ప్రక్క తరిగిపోయిన అటవీప్రాంతాన్ని పునరుద్ధరించేందుకు అటవీశాఖ అధికారులు ప్రయత్నిస్తుండగా, మరో ప్రక్క అటవీ భూములపై గిరిజనులకు హక్కులు కల్పిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది ప్రభుత్వం. జారీ చేసిన ఉత్తర్వులతో అటవీశాఖ అధికారులు అయోమయంలో పడ్డారు. అటవీ భూములపై గిరిజనులకు హక్కులు కల్పించడంతో ఇటీవల 33 ఎకరాలు గిరిజనులకు పంపిణీ కూడా చేయడం జరిగింది. మరికొన్ని అటవీ భూములపై కూడా హక్కులు కల్పించే అవకాశం వుంది. ఈ క్రమంలో అడవులు మరింత తరిగిపోతాయి. జిల్లావ్యాప్తంగా అటవీశాఖ పరిధిలో ఎన్ని వేల ఎకరాలు వున్నాయి? వీటి పరిస్థితి ఎలా వుందన్న పూర్తి వివరాలు అధికారుల వద్ద లభించడం లేదు. ఒకరిపై మరొకరు చెప్పుకుంటూ సమస్య నుంచి తప్పించుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు. ఏది ఏమైనా అటవీశాఖ, సామాజిక వన విభాగాల పనితీరుపై ఉన్నతాధికారులు దృష్టి సారించాల్సిన అవసరం వుంది.

అవినీతి కథ

**• నెల్లూరులో కాల్వల పూడికతీత పేర**

# లక్షల రూపాయల స్వాహా!

**నగరంలో పంట కాల్వల పూడికతీత ఓ ప్రహసనంలా జరిగింది. తూతూ మంత్రంగా గతంలో పనులు చేపట్టిన ఆనం జయకుమార్‌రెడ్డి 10లక్షలు బిల్లు చేసుకొంటే ప్రస్తుతం మాజీ కార్పొరేటర్లు భారీ వర్షాన్ని సాకుగా చూపి 20లక్షలు స్వాహా చేయను సిద్ధమైపోయారు.**


వ్యర్థాలతో నిండిన పంట కాలువ.

నెల్లూరు నగరంలో డ్రైనేజీ కాల్వల పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుంది. నీటి పారుదల కాల్వలతోపాటు డ్రైనేజీ కాల్వలు సైతం ఆక్రమణలకు గురయ్యాయి. దీంతో కొద్దిపాటి వర్షం కురిసినా రోడ్లపై వర్షపునీరు నిల్వ చేరిపోతుంది. సంవత్సరాల తరబడి ఈ సమస్య నగర ప్రజలను పట్టి పీడిస్తుంది. మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు స్పందించి చెత్తా, చెదారంతో నిండిపోయిన కాల్వలను పూడిక తీయించాలని గతంలో నిర్ణయించి లక్షలాది రూపాయలు దీనికోసం ఖర్చు చేయడం జరిగింది.

నిధులైతే ఖర్చయినాయిగానీ సమస్య మాత్రం పరిష్కరించబడలేదు. ఎప్పటిలాగానే డ్రైనేజీ కాల్వలు పూడిపోయాయి. గతంలో నెల్లూరు నగరంలో డ్రైనేజీ కాల్వల పూడిక తీత పనులు ఆనం జయకుమార్‌రెడ్డి చేపట్టాడు. పైపైనే పూడిక తీయడంతో కొద్ది రోజులకే అవి పూడిపోవడం జరిగింది. కాల్వలను పూడిక తీసే సమయంలో ఇంజినీరింగ్ విభాగం అధికారులు దగ్గరుండి పనులు పర్యవేక్షించాలి. అయితే పూడిక తీసే సమయంలో ఒక్క అధికారి కూడా లేకుండా పోయారు. పన్నుల రూపంలో ప్రజలు చెల్లించిన లక్షలాది రూపాయలను అధికార పార్టీకి చెందిన నేతలకు కార్పొరేషన్ అధికారులు దోచిపెడుతున్నారు.

నెల్లూరు నగరంలో ఇటీవల కురిసిన భారీ వర్షాలు అధికారుల నిర్లక్ష్యాన్ని వేలెత్తి చూపాయి. వర్షపునీరు వెళ్లే మార్గం లేకపోవడంతో ఇళ్లలోకి నీరు ప్రవేశించింది. దీంతో పలు కాలనీల ప్రజలు తీవ్ర ఇబ్బందులకు గురికావాల్సి వచ్చింది. భారీ వర్షాలు కురిసి నగర ప్రజలు ఇబ్బంది పడుతుంటే అధికారులు, కాంట్రాక్టర్లకు కాసుల వర్షం కురుస్తుంది. జె.సిబిలు, అద్దెకు తీసుకొని ఏదో ఒక కాల్వను మరమ్మత్తులు చేసినట్లు లెక్కలు చూపి నగదు డ్రా చేసుకొంటున్నారు. పాలకవర్గం లేకపోవడం, పట్టించుకునే వారు కరువవ్వడంతో సిబ్బంది అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారు.

భారీ వర్షాలకు ముందు కూడా నగరంలోని హరనాథపురం డ్రైనేజీ కాల్వను జెసిబితో పూడిక తీయించారు. పూడిక తీసినట్టు చెత్త, చెదారాన్ని బయటవేసి ప్రజలను నమ్మిస్తున్నారు. కార్పొరేషన్‌కు ప్రత్యేక అధికారిగా వున్న అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య అనారోగ్యంతో విశ్రాంతి తీసుకుంటున్నారు. దీంతో కమిషనర్ మొత్తం వ్యవహారాన్ని నడిపిస్తున్నారు. అధికార పక్షానికి చెందిన మాజీ కార్పొరేటర్లు కమిషనర్‌పై ఒత్తిడి తెచ్చి డివిజన్లకు ఏదో ఒక పనిని మంజూరు చేయించుకునేందుకు ముమ్మర ప్రయత్నాలు సాగిస్తున్నారు. భారీవర్షాలను సాకుగా చూపి కల్వర్టుల నిర్మాణం, రోడ్ల మరమ్మత్తుల పనులు చేపడుతున్నారు.

మునిసిపల్ కార్పొరేషన్ నిధులను మంజూరు చేయించుకోవడం ఇటీవల సులభతరంగా మారిపోయింది. రాజకీయ సిఫార్సు వుంటే చాలు ప్రతిపాదనలు లేకపోయినా అత్యవసర పనుల పేరుతో మంజూరవుతున్నాయి. డ్రైనేజీ కాల్వల పూడికతీత పేరుతో ఇటీవల 10లక్షల రూపాయలు ఖర్చు చేశారు అధికారులు. ఇప్పుడు భారీ వర్షాలకు మరికొన్ని కాల్వలు పూడిక తీయాలని ప్రతిపాదించి మరో 20లక్షల రూపాయలు ఖర్చు చేసేందుకు సిద్ధమవుతున్నారు. మాజీ కార్పొరేటర్ల సహకారంతోనే అధికారులు పనులు చేస్తున్నారు. పాలకవర్గం గడువు తీరినప్పటికి వీరి హవా కార్యాలయంలో కొనసాగుతోంది.

రెండు రోజులుగా నెల్లూరు నగరంలో భారీ వర్షం కురవడంతో ఏ మేరకు అధికారులు పనులు చేశారో బహిర్గతమయ్యింది. పనులు ఎంత నాణ్యతగా చేశారో అందరికి తెలిసిపోయింది. నగర ప్రజలు పడుతున్న ఇబ్బందులను ఏమాత్రం పట్టించుకోని కార్పొరేషన్ అధికారులు, సిబ్బందిపై ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. డ్రైనేజీ కాల్వల పూడిక తీత పేరుతో లక్షలాది రూపాయల నిధులు దుర్వినియోగం జరగకుండా నియంత్రిస్తే మంచిది.

# 'బావ' బలహీనం



అల్లూరు రహీం

చిత్ర సమీక్ష

తెలుగులో హిట్ కోసం పరితపిస్తున్న హీరో సిద్దార్థ్‌కు తీవ్ర నిరాశను మిగిల్చింది బావ చిత్రం. శ్రీ కీర్తి కంబైన్స్ పతాకంపై పద్మకుమార్ చౌదరి ఎంతో నమ్మకంతో కొత్త దర్శకుడు రాంబాబుకు అన్ని బాధ్యతలు అప్పగించి ఈ చిత్రాన్ని నిర్మించారు. కానీ పాత కథకు సరైన ట్రీట్‌మెంట్ చేయడంలో దర్శకుడు విఫలమవ్వడంతో 'బావ' బావురుమంటున్నాడు. పల్లెటూరి వాతావరణం, అక్కడి జనాల మధ్య ఆప్యాయతలు, గోదావరి అందాలను చక్కగా చూపెట్టడంలో దర్శకుడు పెట్టిన శ్రద్ధను స్క్రీన్‌ప్లేపై చూపలేదు. 16 రీళ్ల సాగతీత కథ ప్రేక్షకులను బేజారెత్తిస్తుంది. హీరోయిన్ ప్రణీత బొటాబొటిగా వుండడం, మిల మిల మెరిసే పాట మినహా మరో పాటకు చక్రి సరిగ్గా సంగీతమందించక పోవడం సినిమాను బలహీనపరిచాయి. పల్లెటూళ్లలో బూతులెక్కువ మాట్లాడుతారన్నట్లు కొన్ని సీన్లు; మరీ ముఖ్యంగా వంకాయ పేరుతో బూతు మాటల కొనసాగింపు ప్రేక్షకులు మెచ్చరు. అయితే హీరో, హీరోయిన్‌కు తాను పాత స్నేహితుడని తెలియ చెబుతూ బుగ్గపై ఇచ్చే ముద్దు సన్నివేశం యువ ప్రేక్షకుల హృదయాలను గిలిగింతలు పెడుతుంది. ఇదే విధంగా హీరో తల్లి సింధుతులాని పురిటి నొప్పుల సన్నివేశం ఉద్విగ్న భరిత చిత్రీకరణ బాగుంది. వరుడు చిత్రాన్ని ఎగతాళి చేస్తున్నట్లుగా బ్రహ్మానందం ఐదు రోజులు పెళ్లి చేసుకోవడం, ఈ సందర్భంగా మళయాళ పురోహితునిగా అలీచేసే హడావుడి అతిగా వుంది. చాలారోజుల తర్వాత తెరపై కనపడ్డ సీనియర్ హీరో రాజేంద్రప్రసాద్ హీరో తండ్రి పాత్రను కామెడీ, సీరియస్‌నెస్ మేళవించి చక్కగా పోషించాడు. మాటల రచయిత వీరపోతన కామెడీ మాటున బూతు ఎక్కువగానే వ్రాస్తూ కాటు వేసే పాముకు పాలుపోస్తారు; కావలికాసే కుక్కకు కూల్‌డ్రింక్ పోయరంటూ కొన్ని పంచ్ డైలాగులు వ్రాశాడు. అల్లరోడు వీడే పాటలో గోదావరి జిల్లాల అందాలను బాగా చూపడంలో కెమెరామెన్ అరవింద కృష్ణ ప్రతిభ చూపాడు.

ఇక చిత్రకథలోనికి వెళ్తే వెంకటాపురం గ్రామంలో వీరబాబు(సిద్దార్థ్) అతని మిత్రబృందం చేసే అల్లరి అంతా ఇంతా కాదు. దీన్ని భరించలేక గ్రామస్తులు అతన్ని 'ఆదర్శ రైతు' శిక్షణ పేరిట గ్రామం నుంచి వెళ్ల గొట్టను సిద్ధపడతారు. ఈ సందర్భంగా రైలు నుంచి దిగే వీరబాబు తండ్రి సీతారాముడు(రాజేంద్రప్రసాద్) జనానికి మాయమాటలు చెప్పి అతన్ని వెనక్కు తీసుకొస్తాడు. ప్రక్క ఊర్లో వుండే దుర్గాప్రసాద్(ఆహుతిప్రసాద్) ఇంటికి మిత్రునితో కలసి పట్టుచీర ఇవ్వను వెళ్లి న వీరబాబుకు వరలక్ష్మి(ప్రణీత) రింగ రింగ పాటకు డ్యాన్స్ చేస్తూ కనపడి హృదయాన్ని కొల్లగొడుతుంది. అప్పటి నుంచి వీరబాబు ఆమె వెనుకబడి అల్లరి చేస్తుంటాడు. ఈ అల్లరి వరలక్ష్మికి నచ్చుతుంది. తిరునాళ్లలో ఆమె మిఠాయిని ఇష్టపడి తింటూ తానెవరో మిఠాయి తాతకు చెప్పే సన్నివేశంతో వీరబాబులో ఒక్కసారిగా వేయి వాల్టుల విద్యుత్ ప్రవహిస్తుంది. ఇంతలో వర్షం పడుతుంది. చిన్నప్పుడు ఈవిధంగా జరిగితే వరలక్ష్మిని తానేమి చేసేవాడో వీరబాబు అదే చేసి చూపించడంతో ఆమె కూడా అతన్ని హత్తుకొంటుంది. వారిద్దరిలో చిననాటి స్మృతులు కట్టలు తెంచుకొంటాయి. ఈ సమయంలోనే ప్రక్క ఊరికి చెందిన చెంచురామయ్య(తనికెళ్ల భరణి) కుమారుడు రమణతో వరలక్ష్మికి పెళ్లి కుదురుస్తాడు దుర్గాప్రసాద్. వరలక్ష్మి తిరునాళ్ల నుంచి ఇంటికి తిరిగి వెళ్లేసరికి నిశ్చితార్థం జరుగుతుంటుంది. దీన్ని తట్టుకోలేని వరలక్ష్మి వీరబాబు దగ్గరకు వచ్చేస్తుంది. కాస్త హడావుడి చేయడంతో అతను ఆమెకు సీతారాముల ఆలయంలో తాళిబొట్టు కట్టేస్తాడు. వీరిద్దరూ ఇంటికి వెళ్లి తమ పెళ్లి గూర్చి తండ్రి సీతారామునికి తెలియజేయడంతో ఆయన ఫ్లాష్‌బ్యాక్‌లోనికి వెళ్తాడు. వరలక్ష్మి ఎవరో కాదని స్వయాన వీరబాబు మేనమామ కూతురంటాడు. తాను దుర్గాప్రసాద్ చెల్లెల్ని పెళ్లి చేసుకోవడం ఇష్టంలేకపోవడం వల్ల గ్రామంలోనే వేరుగా వుంటున్నామన్నాడు. వరలక్ష్మిని అందర్నీ ఒప్పించి పెళ్లి చేసుకోమంటాడు. ఈ క్రమంలో వీరబాబు దుర్గాప్రసాద్ కుటుంబాన్ని మంచి చేసుకోను అన్నవరం వెళ్తాడు. పెళ్లి విషయం మాట్లాడను సీతారాముడు దుర్గాప్రసాద్ ఇంటికి వెళ్లగా ఆయన్ను ఆ కుటుంబీకులు అవమానించడమే గాక చేయి చేసుకొంటారు. దీన్ని భరించలేక ఆయన చనిపోతాడు. ఇంతలో రమణ తనకు వరలక్ష్మితో నిశ్చితార్థం జరిగిందని ఆమెను చెరబడతాడు. గ్రామస్తుల సహకారంతో పాటు రమణను సైకిల్ పోటీలో ఓడించి మరదలు వరలక్ష్మిని తనదాన్ని చేసుకోవడంతో బావ కథ కంచికి చేరుతుంది. హీరో సిద్దార్థ్ వీరబాబు పాత్రను చక్కగానే పోషించాడు. హీరోయిన్ ప్రణీత అందగించలేదు. బావ బలహీనంగా తయారవ్వడానికి కథ, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వ బాధ్యతలు నిర్వహించిన రాంబాబుదే బాధ్యతనాలి.

## మగవారికన్నా తక్కువ తిన్నామా?



ఏళ్ల తరబడి సహజీవనం చేస్తున్న సినీ జంట జాన్ అబ్రహాం – బిపాసబసులను మీలో ఎవరు ధృడంగా వుంటారన్న ప్రశ్న అడిగితే బిపాస సమాధానం చెప్పింది. సిక్స్‌ప్యాక్ దేహంతో జాన్ ధృడంగానే కనిపించొచ్చు. కానీ నేను మానసికంగా అతనికన్నా ఎంతో ఎత్తులో వున్నాను. ఆడవాళ్లు ఎప్పుడూ మానసికంగా బలంగా వుండాలి. అది అనుకున్నంత తేలిక కాదు. కొన్ని పద్ధతులు పాటిస్తే... మగవారికన్నా ఎందులోనూ తీసిపోం. ఇప్పుడు నా వయస్సు 35 దాటింది. కానీ ఇంకా నాజూకుగానే కనిపిస్తాను. మేకప్ లేకపోయినా అందంగా వుంటాను. జాన్‌అబ్రహాం, నేనూ స్నేహపూర్వకంగానే వుంటాం. మా మధ్య ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అనే ప్రశ్న ఇప్పటికీ తలెత్తలేదంది.

## ప్రేమా లేదు... దోమా లేదు!



హ్యాపీడేస్ ఫేం తమన్నా తమిళంలో అగ్ర హీరోయిన్‌గా ఎదిగింది. కోటి రూపాయలు పారితోషికంగా ఇస్తేనే నటిస్తాననే స్థాయిలో వుంది. తెలుగులో నాగ చైతన్య సరసన నటిస్తున్న ఆమె షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. నేను ముంబాయి నుంచి వచ్చాను. అయినా తెలుగు, తమిళ ప్రేక్షకులు బాగా ఆదరించారు. పరిశ్రమలో నా పని తీరుకు సంబంధించి ఫిర్యాదులేం లేవంది. కార్తీక్‌తో ప్రేమాయణం సాగిస్తురన్నారనే విషయం తరచూ మీడియాలో వస్తుందే అంటే ఇలాంటి పుకార్లు సర్వసాధారణం. ఇక్కడే కాదు, ఏ రంగంలోనైనా అవతలి వ్యక్తి కొంచెం వెలుగులో వున్నారంటే చాలు కట్టు కథలు అల్లేస్తారు. వాటిని పట్టించుకొంటూపోతే మనం పని చేసుకోలేం. నేను నావృత్తిని తప్ప ప్రస్తుతం దేన్నీ ప్రేమించడం లేదంటుంది తమన్నా.

## పేరు చెడగొట్టుకోను!



ఆ ఒక్కడు సినిమాతో తెలుగు తెరకు పరిచయమైన హీరోయిన్ మధురిమకు వంశీ తీసిన సరదాగా కాసేపు మంచి పేరు తెచ్చి పెట్టింది. ఈ వ్యవహారమై ఆమె మాట్లాడుతూ వరుసగా నాలుగు చిత్రాలు నా చేతిలో పెట్టుకోవాలని నేను భావించడం లేదు. మంచి పేరు అంత తొందరగా రాదు. సరదాగా కాసేపు చిత్రం ఆ పేరు తెచ్చి పెట్టింది. ఈ పేరు చెడగొట్టుకోవడం నాకు ఇష్టం లేదు. అవకాశాలు బాగానే వున్నాయి. మంచి పాత్రలే ఎంచుకొంటా. మధురిమ సినిమాలకు ఇక పనికిరాదు... అనిపించుకొనేంత వరకు పరిశ్రమలో వుండను. మంచి సినిమాలు చేస్తాను అంతే అని తన మనసులో మాట బయట పెట్టింది.

## చాలా కష్టపడ్డాను!



బాలీవుడ్ సెక్స్‌బాంబ్ మల్లికా షెరావత్ హిస్...స్స్ చిత్ర ప్రమోషన్‌లో భాగంగా హైదరాబాద్ వచ్చింది. ఈ సినిమా షూటింగ్ అనుభవాలు వివరించింది. కేరళలోని దట్టమైన అడవుల్లో షూటింగ్ చేశాం. విపరీతమైన చలి, భారీ వర్షాల్లో సైతం షూటింగ్‌లో పాల్గొనవలసి వచ్చింది. కేవలం మేకప్ కోసమే ఆరు గంటలు కేటాయించాల్సి వచ్చేది. చుట్టూ విషసర్పాల మధ్య నటించాను. ప్రతి రోజూ షూటింగ్ మొదలెట్టే ముందు నాగినికి పూజ చేసేదాన్ని. అందుకే షూటింగ్ అంతా ప్రశాంతంగా జరిగింది. ఇవన్నీ నాకు కొత్త అనుభవాలు. పాములా కనిపించడం అంత తేలికైన విషయం కాదని తనకు ఈ సినిమాతో అర్థమైందంది.

## తెలుగులో త్రీ ఇడియట్స్



హిందీలో రికార్డులు బ్రేక్ చేసిన త్రీ ఇడియట్స్ చిత్రాన్ని మహేష్‌బాబు హీరోగా తెలుగులో పునఃనిర్మించనున్నారు. ఈ సినిమాకు రోబో ఫేం శంకర్ దర్శకత్వం వహిస్తారు. హిందీలో మాధవన్, శర్మాన్‌జోషిలు పోషించిన పాత్రలను తెలుగులో వరుడులో విలన్ పాత్ర పోషించిన ఆర్య, ప్రముఖ నిర్మాత ఆర్.బి.చౌదరి కుమారుడు జీవా పోషించనున్నారు. వీరిద్దరికి తమిళనాట మంచి ఫాలోయింగ్ వుండడంతో అక్కడా విడుదలకు అనుకూలంగా వుంటుందని ఎంపిక చేశారు. హారిస్ జైరాజ్ సంగీతం అందిస్తాడు. ఈ యేడాది చివర్లో ఈ చిత్రం సెట్స్ మీదకు వెళ్తుంది.

# నెల్లూరు అతలాకుతలం

20 సెంటీమీటర్ల వర్షానికే గందరగోళం



ముత్తుకూరు అండర్‌బ్రిడ్జి క్రింద నీటిలో మునిగిన ఆర్టీసి బస్సు.



కోటమిట్ట వెనుక వాకర్స్ రోడ్డులో నిండుగా ప్రవహిస్తున్న వర్షపు నీరు.

గతవారం రెండు రోజులపాటు కురిసిన భారీవర్షాలకు నెల్లూరు నగరం అతలాకుతలం అయ్యింది. జనజీవనం స్తంభించిపోయింది. 29వ తేదీ రాత్రి నుంచి 30వ తేది వరకు కురిసిన వర్షానికి నగరంలో పలుచోట్ల నడుములోతు నీళ్లు రహదారిపై నిలబడిపోయాయి. దీంతో ఎక్కడికక్కడ ట్రాఫిక్ స్తంభించి పోయింది. ఇక ఆత్మకూరు బస్టాండు, రామలింగాపురం, మాగుంట లేఅవుట్‌లోని అండర్ బ్రిడ్జిల సంగతి తెలిసిందే. కొద్దిపాటి వర్షానికే అండర్ బ్రిడ్జిల్లోకి నీళ్లు వచ్చేస్తుండడంతో తూర్పు ప్రాంతం నుంచి నగరంలోకి రాకపోకలు నిలచి పోతున్నాయి. శివారు ప్రాంతాల్లోని ఇళ్లు జలమయం అయ్యాయి. ఇళ్లలోకి నీరు రావడంతో పలు కుటుంబాలవారు తీవ్ర ఇబ్బందులు పడ్డారు. ఇక పాలకుల పుణ్యమా అని వున్న సమస్యలకు తోడు నగరవాసులకు క్రొత్త సమస్యలు తలెత్తాయి. రహదారి మధ్యలో రాళ్లతో నగరం పొడవునా డివైడర్లు కట్టడంతో పడమర వైపు రోడ్లపై నీరు నిలచి పోవడంతో వాహనాల రాకపోకలు నిలచిపోయాయి. డివైడర్లు లేనపుడు ఆ నీరు తూర్పు వైపున ప్రవహించి కాలువల్లో కలిసేవి. ఈ నిర్మాణాలతో నీరు పోయే వీలులేక నిప్పో, పెద్దాసుపత్రి, కెవిఆర్ పెట్రోల్ బంక్, ఎసి స్టేడియం, ఫత్తేఖాన్‌పేట, లీలామహల్ సెంటర్లు నీటితో నిండి చెరువులను తలపించాయి. వెంకటేశ్వరపురం, జనార్దన్ రెడ్డి కాలనీ, పొర్లుకట్ట ప్రాంతాల్లో ఇళ్లలోకి నీరు వచ్చి చేరింది. ఆత్మకూరు బస్టాండ్, రామలింగాపురం అండర్ బ్రిడ్జిల వద్ద బస్సులు నీళ్లలో చిక్కుకపోయాయి. ప్రతి ఏడాది ఇలాంటి సమస్య తలెత్తుతున్నా సరిదిద్దేందుకు చర్యలు చేపట్టని పాలకులు యధావిధిగా వానలో తడుస్తూ వెళ్లే ప్రజలను పలకరించి ఫోటోలకు ఫోజులిచ్చి వచ్చారు. కొద్దిపాటి వర్షానికే నగర పరిస్థితి ఇట్లావుంటే భారీవర్షాలు కురిస్తే సింహపురి సోయగం ఇంకెట్లా వుంటుందో చెప్పబళ్లేదు.



ఇటువంటి దృశ్యం ప్రతిరోజూ మామూలే.

## హరనాధపురంలో నిత్యం ట్రాఫిక్‌జామ్!

నెల్లూరు నగరంలోని ముత్తుకూరు రోడ్డు కూడలిలో నిత్యం ట్రాఫిక్ నిలిచి పోతుంది. ప్రధానంగా హరనాధపురం రోడ్డుకు ఇరువైపులా చేపలు, రొయ్యల వ్యాపారం సాయంత్రం నాలుగు గంటల నుంచి రాత్రి పది గంటల వరకు జరుగుతుంది. ఈ సమయంలో ఇక్కడ వ్యాపారులకు సంబంధించిన వాహనాలు, చెన్నై ప్రాంతానికి రొయ్యలు, చేపలను తీసుకెళ్లే వాహనాలు నిలిపి వుంటున్నాయి. దీంతో గంటల తరబడి వాహనాల రాకపోకలు నిలిచి పోతున్నాయి. వీటికితోడు రోడ్డు చాలా అధ్వాన్నంగా తయారయ్యింది. ముత్తుకూరు రోడ్డులోని ఆనం వెంకటరెడ్డి విగ్రహం వద్ద నుంచి అపోలో ఆసుపత్రి వరకు రోడ్డు దెబ్బతినింది. ఈ రోడ్డు మరమ్మత్తులతోపాటు ట్రాఫిక్ కదలికకు పోలీస్ ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాల్సి వుంది.

# పెరుగుతున్న కీచక గురువులు!

### ● విద్యార్థినులకు దిక్కెవరు?

విద్యార్థులపై లైంగిక వేధింపులకు పాల్పడే కీచక గురువుల సంఖ్య రోజురోజుకు పెరిగి పోతుంది. తప్పుచేసిన వారిపై చర్యలు లేకపోవడం, రాజకీయ ఒత్తిళ్లు, పలువురి అండదండలతో విద్యార్థినులను వేధిస్తున్న ఉపాధ్యాయులు తప్పించుకొంటుండడంతో ఇలాంటివారు పెట్రేగి పోతున్నారు. గతంలో డికెడబ్ల్యు కళాశాలలో ఒక ఫిజికల్ డైరక్టర్, విఆర్ కళాశాలలో ఒక తెలుగు అధ్యాపకుడు, మొన్న బియిడి కళాశాలలో సైకాలజీ లెక్చరర్ విద్యార్థినులపై లైంగిక వేధింపులకు పాల్పడ్డారు. దీనిపై పలువురు విద్యార్థులు, విద్యార్థి సంఘాలు ఆందోళన నిర్వహించడంతో అధికారులు తూతూమంత్రంగా విచారణ జరిపి చేతులు దులుపుకోవడం తప్ప చర్యలు తీసుకోకపోవడంతో ఆల్‌హుదా పాలిటెక్నిక్ కళాశాలలో అధ్యాపకుడు బరితెగించాడు. పాలిటెక్నిక్ కోర్సుచేసే నందినిశ్రీ అనే విద్యార్థిని పరీక్ష వ్రాయడానికి వస్తే పరీక్ష హాలులోనే హ్యారీజార్జి అనే అధ్యాపకుడు తన కోర్కె తీరిస్తే పాసైపోతావని లేకపోతే ఫెయిల్ చేస్తాననడంతో ఆ విద్యార్థిని తల్లితండ్రులకు సమాచారం అందించడంతో వారు అక్కడకు చేరుకొని పోలీసులకు ఫిర్యాదు చేశారు. దీంతో కలకలం రేగింది. దీనిపై పలుమార్లు కళాశాల ప్రిన్సిపాల్‌కు ఫిర్యాదు చేసినా పట్టించుకోలేదని ఆ విద్యార్థిని వాపోయింది. చివరకు పోలీసులు కేసు పెట్టడంతో కళాశాల యాజమాన్యం ఆ అధ్యాపకుడిని తప్పిస్తున్నట్లు ప్రకటించి చేతులు దులుపుకొంది.



అల్‌హుదా పాలిటెక్నిక్‌లో విద్యార్థినిని వేధించిన లెక్చరర్ వైఖరికి నిరసనగా ధర్నా.

● నెల్లూరు కేంద్రంగా

# ఎర్రచందనం స్మగ్లింగ్!

నెల్లూరు కేంద్రంగా ఎర్రచందనం అక్రమ రవాణా జరుగుతుంది. అటవీ శాఖ అధికారులు ఉదాసీన వైఖరి కారణంగా స్మగ్లర్లు ఎర్రచందనాన్ని నెల్లూరు మీదుగా ఇతర రాష్ట్రాలకు రవాణా చేయగలుగుతున్నారు. అటవీ శాఖ అధికారుల కళ్లుగప్పి కడప, వెంకటగిరి, రాపూరు ప్రాంతాల నుంచి లక్షలాది రూపాయల విలువ చేసే చందనపు దుంగలను తరలిస్తున్నారు. అటవీ శాఖాధికారులు తూతూమంత్రంగా దాడులు జరిపి ఎర్రచందనం స్వాధీనం చేసుకుంటున్నారే తప్ప స్మగ్లర్లపై కఠిన చర్యలు తీసుకోలేక పోతున్నారు. ఎర్రచందనం రవాణా చేసే స్మగ్లర్లకు రాజకీయ నేతల అండదండలున్నట్లు తెలుస్తుంది. ఇటీవల ఉదయగిరి నియోజకవర్గంలో 50 ఎర్రచందనం దుంగలను అధికారులు పట్టుకొన్నారు. వీటి విలువ దాదాపు రెండు లక్షల 50వేల రూపాయల వరకుంటుంది. వాహనాల నుంచి ఎర్రచందనాన్ని అధికారులు, పోలీసులు నిందితులను పట్టుకోవడంలో నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారు. జిల్లావ్యాప్తంగా పట్టుబడిన ఎర్రచందనం అక్రమ మార్గంలో నెల్లూరు టింబర్ డిపోలకు చేరుతుంది. ఇప్పటికైనా ఆ శాఖ అధికారులు స్పందించి ఎర్రచందనం, అక్రమ రవాణాను అరికట్టాల్సిన అవసరం ఎంతైనా వుంది.

### స్మగ్లర్లకు నాయకుల అండ?



నెల్లూరులో జరిగిన రాష్ట్రస్థాయి యోగా పోటీల్లో విజేతలతో మంత్రి రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యే వివేకానందరెడ్డి తదితరులు.

# విద్యార్థుల పట్ల ఆర్టీసి వివక్షత!

ఉచిత పాసులున్నవారిపై చిన్నచూపు

విద్యార్థులు చదువు కొనసాగించేందుకు వీలుగా ప్రభుత్వం ఆర్టీసి బస్సుల్లో తిరిగేందుకు ఉచిత పాసులను అందజేస్తుంది. ప్రతి ఏడాది ఇది అమలవుతున్నా విద్యార్థులకు మాత్రం బస్సుల సిబ్బంది నుంచి వివక్షత ఎదురౌతుంది. పాసులుండే విద్యార్థులను చులకనగా చూడడం, బస్సులు నిలపకపోవడంతో విద్యార్థులు బావురుమంటున్నారు. కొందరు డ్రైవర్లు, కండక్టర్లు ఉచిత పాసులవారని వ్యంగ్య వ్యాఖ్యలు చేస్తున్నారని కన్నీళ్ల పర్యంతమవుతున్నారు. వాస్తవానికి ప్రభుత్వం విద్యార్థులకిచ్చే పాసుల మొత్తాన్ని ఆర్టీసికి చెల్లిస్తుంది. దీనిని ప్రస్తావించకుండా ఉచిత పాస్‌ల వారంటూ విద్యార్థులు బస్సులు ఆపితే నిలపకపోవడంపై పలువురు తల్లితండ్రులు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. బస్సుల సిబ్బంది మాత్రం ఉన్నతాధికారుల నుంచి మెప్పుపొందేందుకు, ఆయిల్ పొదుపు చేసేందుకుగాను బస్సులు నిలపకుండా వుంటున్నారని ఒక వాదన. ఆర్టీసి అధికారులు ఈ విషయంపై తగిన ఆదేశాలు జారీచేసి విద్యార్థులకు ఇబ్బంది కలుగకుండా చూడాల్సి వుంది.

## జనవాణి

2వ పేజీ కొరవ

### ఆటోలో పన్నెండు మంది!

నెల్లూరు ముత్తుకూరు బస్టాండ్ నుంచి నారాయణ హాస్పిటల్ వరకు షేర్ ఆటోలు నడుస్తుంటాయి. వీటిని 12 మంది ఎక్కే వరకు కదిలించడం లేదు. నలుగురు వెళ్లే ఆటోలో ఇంత మందిని ఎక్కించడం దారుణం. బాగా దెబ్బతిని వున్న ఈ మార్గంలో ఇంతమంది ప్రయాణికులతో ఆటోలు నడవడాన్ని తక్షణం నిలువరించాలి.

టి.కోటేశ్వరరావు — కోవూరు

### కారుణ్యాలే కరువాయెనె!

ప్రభుత్వాల ప్రతిష్ట పెరిగేది వుద్యోగులు పని చేయడం వల్లనే. అటువంటి వుద్యోగుల కనీస హక్కులను కూడా ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. ప్రభుత్వ సర్వీసులో వుండి విధి నిర్వహణలో మరణించిన వుద్యోగి కుటుంబసభ్యుల్లో ఒకరికి కారుణ్య నియామకం క్రింద వుద్యోగం ఇవ్వాలి. దీనివల్ల ప్రభుత్వ ఖజానాపై ఆర్థిక భారం పడదు. కాని కారుణ్య నియామకాలు రాష్ట్రప్రభుత్వ సర్వీసులో తగ్గిపోవడం బాధాకరం.

సి.హెచ్.సురేష్‌బాబు — నెల్లూరు

## సంతకాలు

మొదటి పేజీ కొరవ

నిబంధనలు లేవని చెప్పి తిప్పి పంపుతున్నాడట. సిఎంకు ఆంతరంగికులుగా ముద్రపడిన డిఎల్. రవీంద్రరెడ్డి, జెసి.దివాకర్‌రెడ్డి వంటివారు కూడా టిజితో వెళ్లేనే ఉత్తర్వులొస్తాయని చలోక్తులు విసురుతున్నారంటే వెంకటేష్ ప్రాభవం ఎంత జోరుగా వుందో అర్థం చేసుకోవచ్చు.

ముఖ్యమంత్రికి వెంకటేష్‌కు వున్న బాంధవ్యమేమిటన్నది ప్రశ్న. ఇద్దరిదీ ఒకే కులం కావడం ఒక కారణమైతే, చేతులు తడిపి సంతకాలు చేయించడంలో వెంకటేష్ సుప్రసిద్ధుడు కావడం రెండవ కారణమని సెక్రటేరియట్ వర్గాలు గుసగుస లాడుతున్నాయి.

## నన్నెవరూ పట్టించుకోరేమి?

మొదటి పేజీ కొరవ

నలు విడుదల చేస్తూనే వున్నాడు. మహాధర్నాలు, బాబ్లీ మహాయాత్రలు చేస్తూనే వున్నాడు. కానీ ఫలితం మాత్రం కన్పించడం లేదు.

తానెంత కష్టపడినా జనం చర్చల్లోకి రావడం లేదన్న మనోవేదన చంద్రబాబును సతమతం చేస్తున్నది. తనను జనం ఎందుకు పట్టించుకోవడం లేదన్న ప్రశ్నకు సమాధానం దొరకక బాధపడుతున్నాడాయన. కంభంపాటి రామ్మోహన్, యనమల రామకృష్ణుడు, అశోక్ గజపతిరాజు వంటి ఆంతరంగికులందరికీ ఇదే ప్రశ్న సంధిస్తున్నాడు. కానీ వారి దగ్గర దీనికి తగువైన సమాధానం దొరకడం లేదు. వైఎస్.జగన్, కెసిఆర్‌ల గురించి మాట్లాడుకొన్నంత కూడా ప్రజలు తెలుగుదేశాన్ని పట్టించుకోవడం లేదన్న నిజాన్ని మాత్రం ఆయన ఆంతరంగికులు ఒప్పుకొంటున్నారు.

కాంగ్రెస్ క్రింద పడినా, తెలుగుదేశం పైకి లేవడం లేదన్న నానుడి మాత్రం రాజకీయ వర్గాలలో బాగా బలపడి పోతున్నది. ఇది నిజమా, అపోహ అన్నది తేల్చడానికి ఏదో ఒక ఎన్నిక రావాలి. ఇప్పట్లో ఆ సూచనలేవీ లేవు. అయితే ఈ ప్రచారాన్ని ఇదే మోస్తరుగా కొనసాగిస్తే మాత్రం తెలుగుదేశం చాలా నష్టపోతుంది. ఎక్కడో ఒక దగ్గర దీనికి బ్రేక్ వేయాలి. ఆ ఎక్కడ అన్నదే చంద్రబాబుకు అంతుబట్టడం లేదు. గతంలో తన ప్రభుత్వం పట్ల ఏర్పడిన ప్రజావ్యతిరేకత ఇంకా తరిగిపోలేదా అన్నది ఒక అనుమానం. అప్పట్లో రైతు వ్యతిరేకిగా, ఆర్థిక సంస్కరణల పేరిట విద్యుత్ ఛార్జీలను మోత మోగించినవాడిగా జనం దృష్టిలో విలన్ వలె ముద్రపడ్డాడు చంద్రబాబు. ఆ కోపంలో, ఆయన చేసిన మంచి పనులు మట్టిగలిసిపోయాయి. దాని ఫలితంగానే వరసగా రెండు ఎన్నికలలో ఓటమి.

కాంగ్రెస్‌ను కానీ, ప్రభుత్వాన్ని కానీ తప్పు పట్టడానికి చంద్రబాబు ఎంచుకొంటున్న ఏకైక మార్గం – అవినీతి చర్చలు కావడం కూడా ప్రజలను ఆకట్టుకోలేక పోవడానికి ఒక కారణమని పరిశీలకుల అంచనా. అవినీతి విషయం చర్చకు వచ్చినప్పుడల్లా, ఎవరు నీతి మంతులు అనే ఎదురు ప్రశ్న వినవలసి వస్తున్నది ప్రజల నుంచి. ఎవరూ పతిత్తులు కారనే నిట్టూర్పు విన్పిస్తున్నది. అవకాశం దొరికితే ఎవరూ వదలి పెట్టరు లెమ్మనే నిర్వేదం ధ్వనిస్తున్నది. అందువల్లనే వైఎస్ బ్రతికి వున్నప్పుడు కానీ, మరణించిన తర్వాత కానీ ఆయన చేసిన లెక్కలేనన్ని అవినీతి కుంభకోణాలను ప్రజలు తీవ్రంగా పరిగణించడం లేదు. ఆ అవినీతి అనే ఆయుధంతోనే కాంగ్రెస్‌ను కొట్టాలని చంద్రబాబు చేస్తున్న ప్రయత్నాలు అందువల్లనే విఫలమైపోతున్నాయి.

ప్రజల మనసులలో అవినీతి కంటే, ప్రభుత్వ వైఫల్యాలే అధికంగా మెదలుతున్నాయి. సంక్షేమ పథకాల విషయంలో రోశయ్య సర్కారు చూపుతున్న నిర్లక్ష్యం, నిరాదరణలను జనం తీవ్రంగా పరిగణిస్తున్నారు. ఈ కీలును గుర్తెరిగి వాత పెట్టడం చంద్రబాబుకు చేత కావడం లేదు. అందువల్లనే ఆయన ఎంత ప్రాకులాడినా జనం పట్టించుకోవడం లేదు. తెలుగుదేశం పార్టీకి విస్తృతమైన కార్యకర్తల వ్యవస్థ వుంది. గ్రామ గ్రామాన మనుషులున్నారు. వారిని సమీకరించగల్గిన జిల్లా నేతలున్నారు. ఆ వ్యవస్థను రంగంలోకి దించి, ప్రజాసమస్యల మీద ఉద్యమాలు నిర్మించలేక పోవడం ప్రతిపక్షంగా తెలుగుదేశం ప్రధాన వైఫల్యం. ఆ లోపాన్ని సవరించుకొనే వరకు చంద్రబాబు ఎంత మనోవ్యధ పడినా ఫలితం వుండదు.






## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### జగన్‌తో కృష్ణ మాదిగ మాటామంతీ!

మాదిగ దండోరా నాయకుడు మందా కృష్ణ మాదిగ 1వ తేది నెల్లూరు వచ్చారు. ఇటీవల దివంగతులైన దండోరా ఉద్యోగనేత వి.జె.విక్టర్ కుటుంబాన్ని పరామర్శించారు. అనంతరం ఓదార్పు యాత్రలో వుండిన జగన్‌ను చింతారెడ్డిపాళెంలో కలసి కొన్ని సూచనలు సలహాలిచ్చారు. ఇవి నచ్చిన జగన్ ఆయన్ను గుండెలకు హత్తుకొని తనదైన స్టైల్‌లో కృతజ్ఞతలు చెప్పారు.

### జగన్ బసతో టిడిపిలో ముసలం!

జిల్లా తెలుగుదేశం కోశాధికారి, బ్రాహ్మణ క్రాక సర్పంచ్ మేదరమెట్ల కృష్ణారెడ్డి ఇంట్లో వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఓ రోజల్లా బసచేయడం తెలుగుదేశం పార్టీని గందరగోళపర్చింది. కృష్ణారెడ్డి కావలి మాజీ ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాల్‌రెడ్డికి కుడి భుజంలా వ్యవహరించేవాడు. కానీ ఆయనలో మార్పు వచ్చింది. ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్ర శేఖర్‌రెడ్డి కృష్ణారెడ్డిని తనవైపు తిప్పుకొని తెలుగుదేశం పార్టీకి చిన్న ఝులక్ ఇచ్చారు.

### జగన్ ఓదార్పులో జె.కె.రెడ్డి!

నెల్లూరు మాజీ ఎమ్మెల్యే జె.కె.రెడ్డి చాలా రోజుల తర్వాత జనజీవన స్రవంతి లోకి వచ్చారు. జిల్లాలో జగన్ ఓదార్పు యాత్రను పురస్కరించుకొని కోడూరుపాడులో జరిగిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహావిష్కరణ సభలో తళుక్కున మెరి సారాయన.

### పిల్ల దొంగలు – పెద్ద చోరీలు!

యువత పెడదారి పడుతున్నారనే దానికి ఉదాహరణగా 1వ తేది క్రైం పోలీసులు అరెస్ట్ చేసిన ముగ్గురు పిల్లదొంగలను ఉదాహరణగా పేర్కొనవచ్చు. నూనూగు మీసాలు కూడా రాని వడ్లమూరి ప్రసాద్, మల్లూరు శివకృష్ణ, కట్టేటి చరణ్‌లు నెల్లూరు నగరంలో పలు ఇళ్లలో దొంగతనాలు చేసిన బంగారు నగలు, 19 మోటారు బైక్‌లను పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. వీటి విలువ 11 లక్షల రూపాయలని ఎస్పీ దామోదర్ విలేకరుల సమావేశంలో వెల్లడించారు.



# సిడి... డివిడిల షాపుల రిజిస్ట్రేషన్‌తో పైరసీ ఆగుతుందా?



**కొత్త విధానంలో సిడి, డివిడిలు అమ్మే షాపులు రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. తమ దగ్గరున్న క్యాసెట్ల వివరాలతో ఒక రిజిష్టర్ కూడా నడపాలి.**

పైరసీ సిడి, డివిడిలను నియంత్రించేందుకు త్వరలో రాష్ట్రవ్యాప్తంగా రిజిస్ట్రేషన్ విధానం అమల్లోకి రానుంది. దీనికి ఇంతకు ముందే రాష్ట్ర ప్రభుత్వం అంగీకారం కూడా తెలిపింది. కొత్త సినిమా విడుదలైన రెండు రోజులకే పైరసీ సిడిలు, డివిడిలు మార్కెట్లోకి వచ్చేస్తున్నాయి. సినిమా నిర్మాతలకు నష్టాలు రావచ్చునేమో కానీ పైరసీ సిడి, డివిడిలను తయారుచేసే వారు మాత్రం లాభాలు గడిస్తుంటారు. పైరసీ సిడిలను విక్రయించే షాపులపై అనేక దఫాలు పోలీసులు దాడులు చేసి కేసులు నమోదు చేసినా ఎటువంటి ప్రయోజనం లేకుండా పోతుంది. దీంతో సిడి షాపులు, లైబ్రరీలు ఏర్పాటు చేసేందుకు రిజిస్ట్రేషన్ చేసుకోవాలన్న నిబంధన ప్రభుత్వం విధించింది.

ఈ రిజిస్ట్రేషన్ విధానం అమల్లోకి వస్తే పైరసీ నియంత్రణ చేయవచ్చున్నది సినీ నిర్మాతల అభిప్రాయం. నగరాలతోపాటు మండల కేంద్రాల్లో కూడా ఎవరైన సిడి షాపులను నిర్వహించాలంటే తప్పనిసరిగా రిజిస్ట్రేషన్ చేయించుకోవాల్సి వుంటుంది. రిజిస్ట్రేషన్ లేకుండా ఎవరైన షాపును నిర్వహిస్తే వారిపై క్రిమినల్ కేసులు నమోదు చేస్తారు. రిజిస్ట్రేషన్ చేయించుకున్న షాపులో విక్రయించే సిడి, డివిడిలకు సంబంధించిన పూర్తి వివరాలను రికార్డుల్లో నమోదు చేయాల్సి వుంటుంది. షాపుల్లో ఎన్ని సిడిలు అందుబాటులో వుంటున్నాయన్న సమాచారం కూడా వెంటనే తెలుసుకొనే అవకాశం వుంది.

కొత్తగా విడుదలైన సినిమాలను థియేటర్లలో వీడియో తీయించి ఆ తర్వాత చెన్నై, బెంగుళూరు ప్రాంతాలలో సిడి, డివిడిలను తయారు చేస్తుంటారు. వీటిని ఇతర సినిమాల పేర్లతో వుండే కవర్లలో వుంచి అనుమానం రాకుండా విక్రయిస్తున్నారు. పోలీసులు తనిఖీలకు వెళ్లిన సమయంలో కూడా పైరసీలను గుర్తించడం కష్టంగా మారింది. ఒక్కో డివిడి 20 రూపాయల నుంచి 30 రూపాయలకే బయట మార్కెట్లో దొరుకుతుంది. ఇటీవల సినీ పరిశ్రమ ప్రతినిధులు రాష్ట్ర హోంశాఖ మంత్రిని కలిసి పైరసీ సిడి, డివిడిలపై చర్చించారు. వీరి ప్రతిపాదనకు అంగీకారం తెలిపిన మంత్రి వీడియో లైబ్రరీ షాపులకు రిజిస్ట్రేషన్ వర్తింప చేసేందుకు చర్యలు తీసుకొంటామని హామీ ఇచ్చారు.



సిడిలమ్మే షాపులకు ఇక నియమ నిబంధనలు.

## పైరసీదారుల్లో ఆందోళన

రాష్ట్ర ప్రభుత్వం వీడియో షాపుల నిర్వహణకు తప్పనిసరిగా రిజిస్ట్రేషన్ వర్తింప చేయనున్నట్లు ప్రకటించడంతో పైరసీ సిడిలను విక్రయించేవారు భయాందోళన చెందుతున్నారు. రిజిస్ట్రేషన్ లేకుండా షాపులను నిర్వహించడం వీలు కాదు. రిజిస్ట్రేషన్ చేయించుకుంటే పైరసీ వీడియోలను విక్రయించడం సాధ్యపడదు. ఇప్పటివరకు పొందే ఆదాయం వదులుకోవాల్సి వస్తుందన్నది వీరి బాధ. జిల్లాస్థాయిలో పోలీసులకు మరిన్ని అధికారాలు అప్పగించేందుకు ప్రభుత్వం సన్నాహాలు చేస్తుంది.

ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని జిల్లాలోని సినిమా పంపిణీదారులు కూడా అభినందిస్తున్నారు. అయితే వీడియో లైబ్రరీలను రిజిస్ట్రేషన్ చేయాలన్న విధానం సక్రమంగా అమలవుతుందా? లేదా అనే దానిపై సందేహాలు వ్యక్తమవుతున్నాయి. ఎందుకంటే ఎన్ని నిబంధనలు రూపొందించి అమలు చేయాలని ప్రభుత్వం భావించినా ఏదో ఒక రూపంలో తూట్లు పడుతుంటాయి. పైరసీ సిడిల నియంత్రణ కోసం అమలు చేసే రిజిస్ట్రేషన్ విధానం ఎలా వుంటుందో వేచి చూడాలి.

# 2008లో డిఎస్సీ పరీక్ష వ్రాసిన వారు ఎట్టకేలకు అయ్యోర్లు అయ్యారు!

డిఎస్సీ-2008 అభ్యర్థులకు దీపావళి కానుక లభించింది. డిఎస్సీ నిర్వహించిన నాటి నుండి అడుగడుగునా ఆటంకాలు, మరెన్నో అడ్డంకులు, కోర్టు కేసులు, జాబితాలో తప్పులతడకలతో వాయిదా పడుతూ వచ్చిన బిఇడి అభ్యర్థుల మధ్య ఏర్పడిన వివాదం కోర్టుల వరకు వెళ్లడమే ఈ ఆటంకాలకు కారణంగా చెప్పవచ్చు. 2008లో ఆనాడు ముఖ్యమంత్రిగా వున్న వైఎస్ రాజశేఖర్‌రెడ్డి డిఎస్సీ నిర్వహించి ఉపాధ్యాయ పోస్టుల భర్తీకి శ్రీకారం చుట్టారు. దీనిలో డిఇడ్ చేసిన వారికి 30 శాతం రిజర్వేషన్ కల్పిస్తున్నట్లు ప్రకటించారు. ప్రభుత్వ నిర్ణయంతో బిఇడి చేసిన అభ్యర్థుల్లో తీవ్ర నిరసన వ్యక్తమయింది. ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ కోర్టును ఆశ్రయించారు బిఎడ్ అభ్యర్థులు. దాదాపు సంవత్సరంపాటు ట్రిబ్యునల్, హైకోర్టుబెంచ్‌ల్లో కేసులు నడిచాయి. చివరకు సర్వోన్నత న్యాయస్థానం సుప్రీంకోర్టులోనూ 30శాతం రిజర్వేషన్‌పై కేసు పెండింగ్‌లో వుంది.



కౌన్సిలింగ్ సెంటర్ వద్ద తమ వంతు కోసం వేచిచూస్తున్న అభ్యర్థులు.

## నెరవేరిన నిరుద్యోగుల కల

ఈ పరిస్థితుల్లో ఏడాది క్రిందట ప్రభుత్వం సెకండరీగ్రేడ్ పోస్టులు మినహా స్కూలు అసిస్టెంట్ల పోస్టులు భర్తీ చేపట్టింది. ఎస్‌జిటిలకు సంబంధించి కేసులు తెమలకపోవడంతో ఈ ఏడాది జూలై నెలలో మంత్రి వర్గ ఉపసంఘం సమావేశమై డిఎస్సీ 2008 ఎస్‌జిటి పోస్టులను భర్తీ చేయాలని తీర్మానించింది. దానికి అనుగుణంగా కౌన్సిలింగ్ ప్రక్రియ చేపట్టారు. జిల్లాలో మొత్తం 487 పోస్టులను భర్తీ చేసేందుకు సిద్ధమయ్యారు అధికారులు.

సెకండరీ గ్రేడ్ పోస్టులు 466, ఉర్దూ పోస్టులు 8, హిందీ పండిట్లకు సంబంధించి 13 పోస్టులను భర్తీ చేసి పోస్టింగ్‌లిచ్చే సమయంలో బిఇడి అభ్యర్థులు తిరిగి హైకోర్టును ఆశ్రయించడంతో సమస్య మొదటికి వచ్చింది. డిఎడ్ కోర్సు చేసిన వారికి నియామకాల్లో 30శాతం రిజర్వేషన్ అమలు చేయరాదని, నోటిఫికేషన్‌లో చెప్పిన ప్రకారం ప్రతిభ ఆధారంగా నియామకాలు చేపట్టాలన్నది బిఇడి వారి వాదన. దీన్ని విచారణకు స్వీకరించిన జస్టిస్ గులామ్‌మహ్మద్, జస్టిస్ చంద్రకుమార్‌లతో కూడి ధర్మాసనం ఎస్‌జిటి పోస్టుల్లో డిఎడ్ వారికి 30శాతం రిజర్వేషన్‌లకు అనుగుణంగా నియామకాలు చేపట్టవచ్చుని, అయితే తాత్కాలిక ప్రాతిపాదికన మాత్రమే ఇవి జరపాలని తీర్పు నిచ్చింది. స్టే ఇవ్వాలన్న బిఇడి అభ్యర్థుల వాదనను తిరస్కరించింది. దీంతో జిల్లాలో ప్రక్రియ ప్రారంభం కావడంతో ఎంతో కాలం ఉపాధ్యాయులుగా కావాలన్న డిఎస్సీ అభ్యర్థుల చిరకాల కోరిక నెరవేరబోతోంది.



నియామకాలకు ముందు అభ్యర్థుల సర్టిఫికేట్ల పరిశీలన.

నియామకాల ప్రక్రియకు హైకోర్టు ధర్మాసనం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. దీంతో ఇదిగో, అదిగో అంటూ రెండేళ్లకు పైగా ఎదురుచూస్తున్న అభ్యర్థులకు ఊరట కల్గింది. ఈ ప్రక్రియలో ఏర్పడుతున్న ఆటంకాలను పరిశీలించినట్లయితే డిఎడ్,



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11

● విఆర్ కాలేజి

# అక్రమాలు నిజమేనన్న విజిలెన్స్!

ఆనం సోదరుల పాపాలకు పుట్ట వంటిది – విఆర్ కాలేజి. తమ అక్రమార్జనకు, అహంకార ప్రదర్శనకు ఈ విద్యా సంస్థను వేదికగా మార్చడం వారికి ఆనవాయితీ. రైలు టిక్కెట్ కావాలన్నా, విమానం ఎక్కాలన్నా, కార్లకు ఫైనాన్స్ వాయిదాలు చెల్లించాలన్నా, హైదరాబాద్‌కు వెళ్లడానికి చేతి ఖర్చు కావాలన్నా కాలేజీ ఖజానా వారి పాలిట కామధేనువు. ఎన్నిక వచ్చిందంటే అయ్యావార్లను కూడా వదలకుండా పాడి ఆవు పొదుగు పిండినట్లు పిండుతారు. ఎన్నో ఏళ్లుగా సాగిపోతున్న ఈ విచ్చలవిడి దోపిడీని అడ్డుకోవడం ఎవరి తరమూ కావడం లేదు. అది చంద్రబాబు కానీ, రోశయ్య కానీ, వైఎస్ కానీ, నేదురుమల్లి కానీ, అధికారంలో ఎవరుంటే వారి కాళ్లకు మొక్కి కాలేజీ పాపాలు తమను కాటేయకుండా చూసుకోవడం వివేకానందరెడ్డికి వెన్నతో పెట్టిన విద్య. వేణుగోపాలస్వామి కాలేజీ పరిస్థితి అంతే. ఆ దేముడి సంస్థ కూడా వారి కబంధ హస్తాలలో చిక్కి విలవిలలాడుతూ వుంది. ప్రసాదాలు ఆరగించినంత సులభంగా కాలేజీ సొత్తు తిని అరిగించుకొంటున్నా, ఆ దేముడు కూడా ఇంతకాలం వారిని ఏమీ చేయలేక పోయాడు.




ఇన్నేళ్లకు వారి అకృత్యాలకు చిన్న మొట్టికాయ వేశాడు విజిలెన్స్ డైరెక్టర్ జనరల్ దినేష్‌రెడ్డి. విఆర్ కాలేజీ, వేణుగోపాలస్వామి కాలేజీలలో పార్ట్ టైమ్ లెక్చరర్ల నియామకం సక్రమంగా లేదని ప్రభుత్వానికి నివేదిక ఇచ్చారాయన. ఈ రెండు కాలేజీలలో పార్ట్ టైమ్ లెక్చరర్ల సమస్య ఒక రావణ కాష్టం. పాతికేళ్లుగా పొట్టకూటి కోసం వారు పోరాటం చేస్తూనే వున్నారు. వివేకానందరెడ్డి వారి పొట్ట కొడుతూనే వున్నాడు. ఆ బడుగు బడిపంతుళ్ల సంఘం తరఫున బి.శ్రీనివాసులు నాయుడు అనే అయ్యవారు విజిలెన్స్‌కు ఒక ఫిర్యాదు చేశాడు. అటువంటి ఫిర్యాదులు వారు ఎన్నిచేసి వుంటారో లెక్కలేదు. ఇచ్చిన ప్రతి కాగితాన్ని అధికారుల మీద తమ పలుకుబడి ప్రయోగించి చెత్త బుట్టలో వేయించడం వివేకాకు అలవాటు. కానీ ఈసారి మాత్రం దినేష్‌రెడ్డి దగ్గర ఆయన పప్పులు వుడకలేదు. శ్రీనివాసులునాయుడు ఫిర్యాదు మీద సమగ్ర దర్యాప్తు చేసింది విజిలెన్స్ శాఖ. ప్రధానంగా పార్ట్ టైమ్ లెక్చరర్ల నియామకాల మీదనే ఈ ఫిర్యాదు. ఆ ఫిర్యాదు నిజమే అని, నియామకాలు సక్రమంగా జరగలేదని నిర్ధారిస్తూ, అట్లా అక్రమంగా నియామకాలు పొందిన 17 మంది లెక్చరర్ల నియామకాలను రద్దు చేసి, వారికి ఇంతవరకు చెల్లించిన 3కోట్ల 98లక్షల రూపాయలు తిరిగి రాబట్టాలని, అందుకు బాధ్యులైన ప్రభుత్వ అధికారుల మీద చర్యలు చేపట్టాలని సిఫార్సు చేస్తూ ప్రభుత్వానికి నివేదిక పంపాడు దినేష్‌రెడ్డి. ఆ నివేదిక ముఖ్యమంత్రి రోశయ్య దగ్గర గత 11 నెలలుగా దుమ్ముకొట్టుకొని పడివుంది. రోశయ్యతో ఇప్పుడు ఆనం వారికి వున్న బాంధవ్యం సంగతి తెలిసిందే కదా? వారికి నొప్పి కల్గించే ఫైళ్లను ఆయన ఎందుకు చూస్తాడు? మళ్లీ దినేష్‌రెడ్డి వంటి వారెవరో వచ్చేవరకు ఆ నివేదిక గతి దుర్గతే.

విఆర్ కాలేజీలో త్రవ్వి తీయాలే కానీ ఇటువంటి అక్రమాలు పుట్టలు పుట్టలుగా బయటకు వస్తాయి. నూట పాతికేళ్ల చరిత్ర కల్గిన ఈ విద్యా సంస్థలు ఆనం సోదరుల వంటి ఆషాడభూతుల చేతులలో చిక్కుకోవడం నెల్లూరు ప్రజలు చేసుకొన్న దౌర్భాగ్యం.



ఆంధ్రాబ్యాంక్ మాజీ ఉద్యోగి ఎస్‌వి.రామకృష్ణారెడ్డి కుమార్తె లక్ష్మీ సుప్రియ, చంద్రశేఖర్‌రెడ్డిల వివాహం అక్టోబర్ 13తేది నెల్లూరు రంగనాయకులపేటలోని బులియన్ మర్చంట్స్ అసోసియేషన్ హాల్‌లో జరిగింది.

## కార్టూన్ స్కేప్




దీంతో అక్కడికి వెళ్లి - విజయం సాధించేందుకే ఈ జిమ్మిక్కులన్నీ...!

## విస్మరించాల్సినవాడా వైఎస్?

నవంబర్ 2తేది ఢిల్లీలో జరిగిన ఎఐసిసి సదస్సులో వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వూసే లేకపోవడం ఒక వివాదంగా మారింది. వైఎస్ మరణం తర్వాత జరుగుతున్న మొదటి ఎఐసిసి సదస్సు ఇది. పార్టీ ఉన్నతికి సహకరించిన నేతలు దివంగతులైనప్పుడు, వారి సేవలు ప్రస్తావించుకోవడం, సంతాప తీర్మానం పెట్టడం ఎఐసిసికి వున్న సాంప్రదాయం. కానీ ఎందువల్లనో సోనియా భక్తులు వైఎస్‌ను పూర్తిగా విస్మరించారు. సంతాప తీర్మానం పెట్టలేదు. ఎవరి ప్రసంగంలోను ఆయన ప్రస్తావన తేలేదు. వైఎస్ అనేవాడితో కాంగ్రెస్‌కు సంబంధం లేనట్లే నడిచిపోయింది సమావేశం. అంతగా విస్మరించవలసిన తప్పు ఏమి చేశాడని అడిగేవారు చాలా మందే వున్నారు, కానీ దానికి బదులు చెప్పేవారు ఢిల్లీలో ఒక్కరూ కన్పించడం లేదు.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.